శ్రీ

# ప్రహ్లాద నాటకము.



ఏలూరులో న్యాయవాదులుగా నుండి

కీర్తిశేషులైన సోమంచి భీమశంకరము గారి

పుత్రిక, శ్రీకాకుళములో న్యాయవాదిగా

నున్న వేమేంద్రరావుగారి భార్య,

శ్రీమతి

## బుర్రా సూరమాంబ

రచించినది.

[illegible],



శ్రీ విజయరామచంద్ర ముద్రాక్షరశాల,

విశాఖపట్టణము

1929.

# విజ్ఞాపనము.



సోదర సోదరీమణులారా,

చాల కాలమునుండి యేదేని యొక నాటకము రచింపుమని నాతోడి నెచ్చెలులు కొందఱత్యుత్సాహమునఁ బ్రోత్సహింప, నవనవకల్పనల నవరుచులుట్టిపడఁ బెక్కండ్రు కవికులోత్తముల ముఖంబున వెలువడి వన్నెకెక్కినదైనను, భక్తులయందగ్రగణ్యుఁడును సకలసద్గుణసమన్వితుఁడును సకలజనాదర్శనప్రాయుఁడు నగు ప్రహ్లాదునియందు నాకుఁగల భక్తి గౌరవంబులఁబట్టి నాకుంగల యల్పజ్ఞానము తోడనే యల్లి నాచెలుల కోరికం దీర్పఁగోరి నేనీనాటకంబును రచించితిఁగాన దయాళురైన పెద్దలిందలి లోపంబుల నెంచక మన్నింతురు గాక.

ఇటు విన్నవించు

శ్రీకాకుళము,
1-6-1929.

విబుధ విధేయురాలు,
బుజ్జి సూరమ్మ.

# పీఠిక.



ఈ ప్రహ్లాదనాటకము నా మిత్రులు కీర్తిశేషులైన సోమంచి భీమశంకరము పంతులుగారి పుత్రిక, నా శిష్యుఁడు శ్రీయుత బుఱ్ఱా దేవేంద్రనాథు భార్య, శ్రీమతి సూరమాంబ రచించినది. ఈమెది వెలనాటి శాఖ.

ఈ యువతి పండితకవులైన తన తండ్రిగారి వలన చిన్నతనమునందే తెనుఁగు బాసయందుఁ జక్కని జ్ఞానమును గవితాశక్తియు సంపాదించుకొన్నదై, యటు వెనుక స్వయంకృషివలన తన విద్య నభివృద్ధి పఱచికొని, యిట్టి గ్రంథములు రచించుటకు సమర్థురాలైనది. స్త్రీవిద్య వెనుకఁబడి యున్న మనదేశమునఁ బురుషులతో సరిసమానముగా గ్రంథములు రచించుచున్న కవయిత్రులు కొందఱయినను నుండుట దేశము యొక్కయు భాషయొక్కయు భాగ్యాభివృద్ధికి సూచకములు. అట్టి కవయిత్రులలో మన బుఱ్ఱా సూరమాంబ యొక్కతె యని చెప్పి పోవ వలసినది కాదు. ఈమె కవితాశైలి 'తేనె సోఁక నోరు తీయనగు' నట్లుండును. ఇంకఁ బోవు నాకిఁక నుడివి చెప్పనేల?

అచ్చుపడిన యీమె పుస్తకములలో నిది మైదవది. మొదటి భాగవతీస్తవస్తబకము, హారశతకము, సావిత్రీవిజయము, భక్తవత్సల శతకము తండ్రిగారు సజీవులై యున్న కాలముననే యచ్చుపడినవి. అచ్చుపడని తక్కిన పుస్తకములు త్వరలో ముద్రింపబడవలెనని యీమె భర్త యాశయము. అట్టి యవకాశ మాయనకుఁ గలిగించుటకు తగిన ప్రోత్సాహము విద్యాధికారులును ఆంధ్రమహాజనులును గలిగింతురు గాక!

ఇట్టి గ్రంథములనేకములు రచించుటకై యీమెను భగవంతుఁడు దీర్ఘసుమంగళిని జేయును గాక!

విశాఖపట్టణము,
1-6-1929.

సెట్టి లక్ష్మీనరసింహము.



శ్రీ

# ప్రహ్లాదనాటకము.

## ప్రస్తావన.

### నాంది.

మ॥ నరసింహాశ్రయమై, సుపర్వనిచయానందప్రదంబై, భయం
కరనక్తంచరభీకరాకృతిసుభక్తామోదమై, నారదో
పరతిజ్ఞానసుబోధితామృతమనఃప్రహ్లాదసంవర్ధమై,
స్థిరమై, శాశ్వతమైన శ్రీహరికృపాశీస్సుల్ మిముం బ్రోచుతన్

(నాంద్యంతమున సూత్రధారుఁడు ప్రవేశించును.)

సూ—(తెరవంకఁజూచి) నటీ! నటీ.

(నటి ప్రవేశించును.)

సూ—నటీ! చూచితివా, ఈ సభాసదులు ఎట్లు వేగిర పడుచున్న చిత్తంబునఁ దిలకించుచున్నారో?

నటి—ఆర్యా, ఎందులకని?

సూత్ర—నేఁడే దేని భక్తిపూర్ణంబగు నాటకంబును జూడవలెనను వేడుకనఁట.

నటి—అహా! అట్లయిన మనమిప్పుడేది ప్రదర్శింతము?

సూత్ర—ఏమున్నది?

సీ॥ ఎద్దానిఁ దిలకింప నిహభోగతతిఁ గోసి
చిత్తమచ్యుతునందె హత్తుకొనునొ।
ఎద్దాని విన్న సర్వేంద్రియవ్యాపార
చలనంబులుడిగి నిశ్చలత గనునొ।
ఎందు ముల్లోకమ్ము లేకాకృతిని వెల్గు
సచ్చిదానందసంస్తవమొసఁగునొ।
ఎందఖిలసురాళివందనీయంబైన
చిత్తోపగతిని సుస్థిరతనిడునొ।
గీ॥ ఏని సంసారియైన, ధనేషియైన।
పాపియైనను దుర్మదాలాపియైన।
నొక్కటేఁగన్న ప్రహ్లాదముప్పతిల్లు।
పుండరీకాక్షు కథకెందు పూజ్యమందు॥

నటి—(స్ఫురణకు వచ్చినట్లు అభినయించుచు) ప్రాణేశ్వరా, చక్కగా వక్కాణించితిరి. అహేతుకంబుగా మీనోట వెలువడిన ప్రహ్లాదచరితంబుకన్న నెక్కుడు భక్తజనాహ్లాదకరంబు కలదా?

సూత్ర—ఓహో! మేలు, మేలు. నేడు మనమిదియే ప్రదర్శింతము. ఏల యన?

గీ॥ కాముకున్నైన, భవభోగతప్తున్నైన,
ముముక్షున్నైనను, ధనమదోన్మత్తున్నైన,

నతులపై కుంత చింతనామృతము గ్రోల
చేతులొగ్గఁడే తనివోని ప్రీతిఁ జేసి?॥

సర్వజనాహ్లాదకరంబగు ప్రహ్లాదకథయే నవనవకల్పనాకలితంబుగా నవరసభరితంబుగా రచియింపఁబడినది; నదియే మన మిప్పుడాడి యీసభాసదుల మెప్పువడయుట మేలు.

నటి—(కనుబొమ్మలు చిట్లించి) ప్రాణేశ్వరా, యీ నాటకం బెవరు రచియించిరి?

సూత్ర—కళ్యాణీ, నీ వెఱుఁగవా?

కం॥ ఇల వైదికశాఖను పెం
పలరఁగ సోమంచిసత్కులాంబుధికిన్ శీ
తలకరుని మాడ్కి నొకవిభుఁ
డలరారెన్ సకలకోవిదానను(డగుచున్॥

నటి—(కొంచెము మోముచిట్లించి కనుబొమలు పైకెత్తి) ఓహో! వీరు హేలాపురీవాసులు కారుగదా.

చ॥ పనివడి కంటుసద్ధి పడి బాహువు సాచిన దేహియంచు కాదనక య లేదు హెమ్మనక దానవిధిన్ పరితుష్టినందఁగాఁ
దనుపు సుధర్మకీర్తిఖని దైవహితంబుగ భీమశంకరా
ఖ్యను మనువాప్పచుత్కృతి సనంతుఁడతండితఁడే మొదూడుఁడీ

# ప్ర హ్లా ద నా ట క ము.

సూత్ర—అగునగును. జగమెఱిఁగినవాని సన్నుతింప నేల? అట్టి దీనబంధు నేమనికొనియాడుదు?

సీ॥ ఎఱుఁగైనచోఁ బెన్ను వదలఁ జాలని మృదు
మధురవాక్యముల నింపొదవఁజేయ।
కన్నుంగవను మహాపన్నుల పొడఁగన్న
నన్నవస్త్రములిచ్చి యాదరింపఁ।
దనవారు పెఱవారలనుమాట లేకుండ
ననయంబు సమప్రేమమున మెలంగ,।
దానమొసఁగుపట్లఁ దనుఁదా నెఱుఁగని ని
ష్కపటభావంబుచేఁ గరుణనింప,।
గీ॥ సతిని కాంతుఁడే సు గాని యన్యుల నెఱుఁగఁ
గోల్పఁగా రాని బుధలోకపూజ్యుఁడతని
పట్టి దీని రచించి చేపట్టె నహిత
చిరయశము సద్బుధుల్ మెచ్చ దురితమెడల॥

నటి—(శంకాకులేక్షణయై) నాథా! కాళిదాసాది మహాకవి విరచితంబులగు నభిజ్ఞానశాకుంతలాది నాటకాళి చవిగొనుటయె గాక యనవరతము నెదురులేని కవికులోత్తముల కరలిఖితంబులై గణుతికెక్కిన ప్రహ్లాదచరిత్రంబుఁ గనుచున్న యీసభికుల నల్పవయస్కయు నల్పప్రజ్ఞయునగు నీయుఁగన రచించిన నాటకంబు సంతుష్టహృదయులఁ జేయఁగలదా? ఏలయన,

సీ॥ ఛందస్సు మొదలుగా సాహిత్యమార్గముల్
వినియైన నెఱుఁగని వెలఁది గాన।
మున్ను శాశ్వతకీర్తి గన్న పాత్రముల
పేరైన నెఱుఁగని నారి గాన।
కావ్యములామర కాండత్రయంబైన
కన్నారఁ గాంచని కలికి గాన।
కవితాప్రవీణుల కడఁజేరి పరియైన
వెలసైన నెఱుఁగని గరిత గాన।
గీ॥ అట్టి యసాధ్వి విరచించినట్టి దాన
నెట్టిలోపంబు లెన్ని చూపట్ట నగునొ
యంచు మనమింత సందియంబందుచుండె
ధైర్యమొక్కింత తాళని తరుణిఁ గాన॥

సూత్ర—సుందరీ! అట్లనకుము. ఈమానిని యధికవిద్యాభ్యాసిని గాకున్నను తన యాంతరంగికమున స్వచ్ఛంబగు భక్తిబలంబుచే నల్లిన భగవచ్చరిత్ర మంత నీరసమగునా?

చ॥ సురనది వంకరల్ దిరుగుచోఁ గొఱఁగాఁబు నెదమ్మహత్త్వముల్? మే
మఱయఁగ భక్తిపూర్ణమగు నట్టి చరిత్రమొకింత దోసముల్
పఱిగిన మాధురిన్ గనదె? పావనశీలుర కెందునైన సుం
దరతను వొప్పకున్నఁ బరతత్త్వవిచారము లోటు గల్గునే॥

నటి—మంచిది! అట్లయిన నన యాంబు నైహికేచ్ఛాచరితని శృంగారాదిరసావలోకనముచే ప్రొద్దులుపు

# ప్ర హ్లా ద నా ట క ము.

చ్చు నీ ప్రేక్షకుల వినయగతులఁ బ్రార్థించిన వెనుక వీరి మనోవీధి నొక్కింత భక్తి, జ్ఞాన, వైరాగ్యాంకురముల నాటఁజేయు నీనాటకోద్యమమునకుఁ గడంగుదము.

సూత్రి—మంచిది. అట్లే కావింపుము.

చ॥ విషరుహనేత్రి, వేగ చని పెద్దలకెల్ల నమస్కరించి రా
జసము తమంబునుం దొలఁచు సత్త్వయుతంబగుఁ గాన నొక్కచో
రసికత తప్పియున్నను నిరాదరణంబున గేలి చేసి యా
పసి యొలనాగలోపములఁ బాటిగఁ బట్టకుఁడంచు వేడుమీ॥

నటి—(అంజలిపట్టి ముందుకునడచి)

సీ॥ భరతభూమిని నిరంతరసుకీర్తిని గన్న
సత్కృతుల్ నిలిపిన సభ్యులార,
యొండిచమాత్రికులకెల్లఁ జిగుర్లిచ్చు
మధురస్వరముజిమ్ము మాన్యులార,
కాళిదాసాది సత్కవులకు సరివచ్చు
శుద్ధికవిత్వముగూర్చు సుకవులార,
నిరుపమపాండితీగరిమ దిశల నింపు
[illegible] విద్వాంసులార,

గీ॥ భక్తివైరాగ్య[illegible]సంధితమై
[illegible] దీని
సారమే గ్రోలి [illegible]సగులఁ జాడలోన
వెడిక బోకుండ మిమ్ముల వేడుదాన॥

నాథా, యింక కాలయాపనము మాని కర్తవ్యము నకు గడంగుదము రమ్ము.

సూత్రి—చెలీ, అట్లైన నీవీఋతువు నభినందించి యొక గీతంబుఁ బాడెదవా!

నటి—మంచిది (పాడును.)

ద్వి॥ చూడుఁడీ మధుమాస శోభలనెల్ల
నాఁడెమా మదని బాణమ్ములోయనఁగ
వివిధ పుష్పంబుల వింతశోభలను
దవిలెడి వనలక్ష్మి తమి దలిర్పంగ
భవరోగముఁ దోఁచు బాధలణంచి
నవనవామోదంబు నటియించి మించి
మోడులకుచివుళ్ల మొలకలెత్తించి
నీడల పాంథుల నిలుపంగ నెంచి
కోయిలలకు మావికొనల విందొసగి
హాయిగా జీవుల యలసటల్ దొలఁగ
కలకలఁపలుకు చిల్కలపల్కులొప్ప
నలలతెమ్మెర మేన నందంద సోఁక
హారికథఁబోలె వావా! మాధురంబు
నిరుపమానందంబునిధి వసంతంబు.।

నాథా, యిఁక పోదము రమ్ము.

(తెరలో)

అరరే దురాత్మా, యింక నెక్కడకు పోయెదవురా, దుర్మతీ?

నటి—(భయమున) నాథా, ఆకఠోరవాక్యము లేమి?

సూత్రి—చెలీ! దుర్లభవరములంది వచ్చిన దితితనూజుని కఠోరవాక్యముల వలె నున్నవి, ఇఁక మనమిచ్చట నిలువరాదు, పోదముర! (పోదురు.)





శ్రీ

# ప్రహ్లాదనాటకము.

## ప్రథమాంకము.

### రంగము 1.

హిరణ్యకశిపుఁడు విప్రచిదాది మంత్రివర్గముతో
శంబరాదికుమారులతో ప్రవేశించును.

హి—(సింహాసనమదరునట్లు తన్నుచు) ఓరోరీ! యింద్రహతకా! ఎంతటి సాహసంబునకుఁ జొఱఁ గొంటివిరా!– ఊఁ, తరువాత, తరువాత.

వి—తరువాత నోదేవా! మన రక్కసుల పిండొక్కుమ్మడి నుక్కుమీఱి నిలింపులపైఁ బడి నుక్కడంపఁజూచెను కాని,

హి—(అదరిపడి) కాని యేమి? మనవారికపజయము వాటిల్లలేదు గద?

వి—నాఁటి జయలక్ష్మి సంపూర్ణముగ సురలనే వరియింప మనవారికపజయమెట్లు రాకుండును?

హి—హా! (దిగ్భ్రమమునఁ జూచి) చిట్టెలుక సింగపుఁ గోఱలఁ బెఱుక సాహసించెనా?

వి—దానికేమి? ఆ సురలతోడంతటి దుష్కృత్యమొన
రింపకున్న జయముగొన్నను గొంతమేలే!

హి—(ఆశ్చర్యముతో) దుష్కృత్యమా! అదేమి?

వి—(హీనస్వరముతో) దేవా, యేమనిచెప్పుదు?
ఏమిచెప్పుటకును నోరాడకున్నది. హా, కాలగతి!

సీ॥ నలుమొగంబుల ప్రోడ బలుతపంబున మెచ్చి
చెచ్చెఱఁ దాఁజేరవచ్చి గ్రుచ్చి।
కౌఁగిటఁ గదియించి ఘనకమండలుజలం
బుల మేను గడిగి. వీఁపునను దట్టి।
వాంఛితం బెఱిఁగి భూవాయునీరములందు
బగటి రాతిరి నగ్నిఁ బరిఘశూల।
ఖడ్గాదిశస్త్రనికాయంబుచే నర
సురపన్నగేంద్రకింపురుషతతిని।
గీ॥ మిత్తి గనవంచు వరమీయ మేటి యశము।
నందితివి, అట్టి నీసతి యమరపతికిఁ।
జిక్కె, శోకింపఁగానయ్యె దిక్కుమాలి।
హావిధీ! కాలగతిని నేమందునొక్కొ॥

గా—(పండ్లు పటపట కొఱుకుచు పెద్దయెలుఁగున)
ఆ, యేమీ! ఆనీచాత్ముడు, ఆదుర్మదాంధుడు, మ
న్మనోహారిణిని, మత్ప్రాణసమానను నాలీలనే కొ
నిపోయెఁగా? హాలీలా! అనంతకీర్తివిశాలా, (ఎద

పై చేయిడి కొంత సేపూరకేయుండి మరల తలయె
త్తి) ఆక్రూరాత్ముఁడు నిన్నిట్టు కట్టడులఁ బెట్టు
చుండేనో కదా? కట్టా! నిండుచూలాలివగు నీవా
యసురాధముని పంచలం బడి పరితపించుచుంటివా!
(తల వంకించి) కానిమ్ము, విప్రజిత్తా, పరమపతివ్ర
తామణిని మత్ప్రాణేశ్వరినిం బట్టి యిట్టి వగల పా
లొనరించిన యా పలుగాకి గుండెలదర వాని సుర
లోకమెల్ల ముట్టడించి యచ్చరలతోఁ గూడ వాని
యిల్లాలిం బట్టి తెచ్చి లీలావతి పాదదాసిం గావిం
చి కరుణారసమన్నది లేక యాపిరికిపందను నేలఁ బె
ట్టి నాకాలఁ బ్రామి విడిచెద; చూడుఁడిదె నాప్ర
తిజ్ఞ (పండ్లు బిగఁబట్టి) ఓరీ దురాత్మా,

శా॥ ఏమీ! యేనలహీనపౌరుషుఁడహార్యకుఁడనంచెంచితో? [త్రో?
నామాహాత్మ్యక్షమెఱుంగవో? ఘనమదోన్మాదంబునన్ గొవ్వి
తామున్ గౌతముఁ డిద్దచక్షువుల యాదైనన్ మదిన్ లేదో? పెన్
కామాంధత్వము కన్నుగప్పెనొకో? మత్కాంతామణిన్ బట్టగన్.

ఔరౌరా! యెంతపనిచేసితివిరా!

శా॥ ఓరీ! నీచసురాధమా, వెఱపులేదో, ప్రాణముల్ చేదో, దు
ర్వారప్రక్రియశోషితారిజనకుంభస్ఫూర్తి వారాశి మద్
ఘోరాసి ప్రహారమ్ములన్ చవిగొనన్ గోర్కెన్ మదిన్ గోరితో,
చోరాగ్రేసర, సేమ లేనిఁటి వాఁడ్ధాఁతమున్ చేరఁగన్॥

(నారదుఁడు ప్రవేశించును)

అందఱు నమస్కరింతురు.

హి—(చేతితో ఆసనమున కూర్చుండుమని సన్న చేసి) ఏంటివా దేవమునీ! ఆదేవాధిపుని శాపరము?

నా—అవునవును. నేనాయుదంతమంతయు సాంతముగా నెఱింగించుటకే నీకడకరుదెంచితి.

హి—నారదా! అప్రతిహతతేజోధురీణుండగు నంబుజాసను నంతవానిం దపంబున మెప్పించి ముల్లోకంబుల నెద్దావ నంతంబులేని యమోఘవరంబులఁ బడసితినని యమందానందకలితుండనై పురంబుఁ జేరినంతనె పిడుగువంటి యీదుర్వార్త వినవలసి వచ్చెంగదా, కట్టా! చూలాలగు నాయిల్లాలురులవంచలంబడి వరితపింపవలసి వచ్చెనా. ఛీ లీలా!

నా—దితినందనా! నీయిల్లాలికంత పరితాపమేల?

హి—దురాత్ముఁడగు సురపతిచే చిక్కిన నాతరుణి యెట్లు పరితపింపకుండఁ గలదు?

నా—ఆసాధ్వి సురపతిచే చిక్కలేదే.

హి—మఱి యెందున్నది?

నా—మదాశ్రమంబున సుఖశాత్మురాలై యున్నది.

హి—ఆహా, మహాభాగ్యము. నారదా, ఆచంచలనే
త్రికు నీసంరక్షణభాగ్య మెట్లబ్బె?

నా—అమరవతి గొనిపోవు దారిలో నొక యాఁడుకూ
యి నాకర్ణంబులం బడ పరువిడిపోయి యడ్డగించి
యా యమను భద్రంబుగ మదాశ్రమంబునకుం
గొనిపోయితి.

హి—ఓరీ! పలుగాకీ, నాఁడే నారదునికంటఁ బడితివి
గాన బ్రతికితి, వింక నెట్లు దప్పించుకొనెదవో చూ
చెదం గాక. నారదా, మొదురఁబడినవాని మోము
చెదరఁబెట్టక యేల విడిచితివి?

నా— రాజా, యేల విడుతును? తగినంతవఱకు కష్టపు
ద్ధులఁబెట్టియే విడచితి. నీయిల్లాలి సిగ పూవేని చె
గకుండఁ దెచ్చి విడచితిని. ఇక నేఁబోయివచ్చెద.

హి—నారదా, నీమేలు మఱవను. నేఁటికి నాయాతి
థ్యమంది పోవా?

నా—దానికేమి? మఱొకప్పుడు సావకాశముగ వచ్చె
దను. (లేచును)

హి—నారదా, చెప్ప మఱచితిని. నీవు త్రిలోకసంచారి
వి గాన నిఁక ముల్లోకవాసుల కీశ్వరుండ నేనని
యెఱింగింపుము. నాయాజ్ఞ తప్పితిరిగ రాదని ది

కృతులకు తెలియఁ బలుకుము. (విప్రజిత్తునుచూచి) విప్రజిత్తూ, నీవిప్పుడేచని యమరావతి మొదలగు నష్టదిక్పాలకపురముల ముట్టడింపఁదగు సేనల నాయితంబు గావింపుము. (నారదునితో) నారదా, యొక్కసారి పుత్రశోకాతురయగు తల్లిగారి పునర్దర్శనంబునకై లోనికేగివచ్చెద. (పోవును)

అందఱు నిష్క్రమింతురు.

నా—ఆహా! యేమి వీని వరగర్వము, తానే సర్వలోకేశ్వరుండఁట. ఈశ్వరుండెందును లేనేలేఁడా? కానిమ్ము. నాప్రయత్న మింతవఱకు చక్కగానే ఫలించినది. లీలావతీ గర్భస్థుండగు నర్భకు నతులిత భక్తియోగమహిమాతిశయబోధనచే యాగర్భ భాగవతునిం గావించితి. ఇంక వైకుంఠమున కేగి యీదానవుని దురంత మాహారికెఱింగించి కినుక రెట్టింపఁ జేసెద. (పోవును)

1 అంకము. 2 రంగము.

పుత్రశోకాతురయై దితి, ప్రక్క నాసీనుఁడై
హిరణ్యకశిపుఁడు, చెంత నిలిచియున్న
లీలావతి ప్రవేశము.

ది—హా! నాచిన్నతండ్రీ హిరణ్యాక్షా,

ఉ॥ దిక్కులకెల్ల మేటివగు ధీరుఁడవీవని లోకులెల్ల నీ
దిక్కటు చేరుచుండ నొక దీనునిభంగిఁ బురంబుఁ బాసి యా
మ్రిక్కిడి పందిపోటులకు మార్చిలి యావనభూమి నక్కటా
దిక్కుఁ జెడిపోతివే కొడుక, దిక్కిఁక నాకెట చేరఁజూపితే॥

హి—తల్లీ!

చ॥ అనఘమనీషికశ్యపుని యంతటివానికి కూర్మినందు భా
మినివయి, లోకభీకరుల మేటి తనూజులఁ గాంచి, లోకముల్
గొనకొని గోటమీటి తుదకున్ దివిఁజేరి సుఖించుచున్న యా
తనయుఁడు చచ్చినాఁడనుచు తల్లి యిటుల్ విలపింపఁ జెల్లునే॥

ది—అయ్యో! యెంత వెఱ్ఱివాఁడవురా కట్టా. అఖండ దోర్దండ ప్రతాపులగు తనయు లిరువురు నిరుభుజంబులై యుండ సవతిబిడ్డల జడుపేటికని కడిపెడాసతోనున్న, కుడిభుజమే కూలిపోయెఁగదరా తండ్రీ.

హి—అమ్మా, చావుపుట్టుకలు ప్రాణికోట్లకుఁ సహజములు గావె? యిదేటిభ్రాంతి?

కం॥ ఎక్కడి సుతు, లెక్కడి హితు,
లెక్కడి బాంధవులు సతు, లిఁకెక్కడి ధన, మిం
కెక్కడి సుఖ, మింతయు నిజ
మెక్కొ? మదిన్ దోఁచు విభ్రమోత్పత్తిగదే॥

లీ—దైతేయాన్వయకులపావనీ, వీరమాతవగు నీవే యిట్లు విలపింప నిఁక నీచిన్నికోడలి నూరార్చువా

రవ్వాసు తల్లీ. చూడుము, ప్రియానుజవియోగంబు న చెన్నుదఱిగియున్న యీ దానవచక్రవర్తి నైజం బూచుకొని యుంచుక శాంతింపుము.

హి—తల్లీ! తెరువున నేగు తెరువరులవలె జీవులు సంయోగ వియోగంబు లందుచుందురుగాక తిన్నగా చూడుము.

కం॥ తల్లెవరు? పిల్లెవరు? । తల్లీ, కనుకట్టుగాదె? తగఁ బరికింపన్
ఎల్లెడల నింద్రజాలము; । కల్లగదే? తానుగన్న కల నిజమగునా?॥

ది—(కన్నీరు దుడుచుకొనుచు) నాయనా, నీవన్నది నిజమే కాని

ఉ॥ అన్నిట నాకు గూర్మినిడునట్టి తనూజుఁడు, నాదు నెయ్యపుం
బున్నెపుదీవి, దైత్యకుల పూజ్యుఁడు, బాహుబలంబునందు నీ
కన్నిటఁ దోడు నీడ యగునట్టి తనూభవుఁడిట్లు చేసి, నా
కన్నుల చిచ్చువెట్టి చనఁగా నిఁక నేగతి సైఁతుఁ బుత్రకా॥

హి—అమ్మా, చక్కగా విచారింపుము.

మత్త॥ తనువు నిత్యమ, సత్యమా? మఱి తల్లిదో నిరపాయమా?
ఘనమ్మె రొంతఁగ నీటిబుగ్గయు గాదె? దీని నెఱుంగవే?
జనమందెడి దేహికిన్ మృతి సత్యమంచుఁ దలంపవే?
మనకు యీగతి శోకవార్ధి మునుంగ మాతరో, వగచెల్లునే॥

లీ—దానవజననీ, యీ మహాత్ముని వాక్యంబు లాగమ ప్రోక్తంబులు గాన నీవీ వాగమృతధారల నించుక శాంతింపుమా.

ది—అబ్బా. యీపుత్రవియోగానలశిఖ లేటులె ట్లు?

హి—ఎంత యమాయకురాలవమ్మా?

మత్త॥ కాయమెప్పటికైన నిక్కముకాదు కాదుగదమ్మ? యీ
మాయబొమ్మల యాటయందసమాన విభ్రమమందదే?
వాయుచాలితమైనదీపిక భంగి దోఁచెడి దేహమం
దీయపారవిచారమెందు, కిదేటిచోద్యము? తల్లిరో॥

ది—ఔరా, హిరణ్యకశిపూ? యేమి నీశౌర్యసంగనీతులు! ఎట్టెట్టూ, జగదేకశూరుండగు నీచిన్నతమ్ముని కై పగసంధించదగదో? ఆహా! అట్టి రణప్రతాపుని, అట్టి లోకత్రయభీకరు నొక్క బిచ్చపుఁ బంది యెదురుపాటున పైఁబడి తనపొట్టను బెట్టుకొనెనన్న నీకది తలపంపునగ లేదా, చిన్నతనము కాదా, నీముద్దుతమ్ముని బొరిగొన్న పగ దీఱ నామొండినూకరాకాయని బరిమార్చు తలంపైన నీతలఁపునకురాదా? నీవట్టుంటయెగాక పైపెచ్చు నాకుఁగూడ నిట్టి మెట్టవేదాంతబోధన గావింప నేతెంచితో? చాలుచాలురా తండ్రీ, యీపనికిమాలిన యుపదేశముచే కణకణలాడు నాయంతరాత్మ చల్లాఱునమకొంటివా వట్టి?

మత్త॥ అన్నిలోకము లొక్కపెట్టున నట్టె చాపగ చుట్టి కా
లోన్నతిన్ గని దేవదానవకోటిం దనుఁగాల్పఁ గా

కన్న మేటియశంబునించి సుఖంబునందు సుతుండటం
చున్న నాకిది చిచ్చుపెట్టెను సూనుఁడీగతిఁ బుత్రికా॥

లీ—(తనలో) అయ్యో! ఈయన కఠోరవాక్యములచే నీయనఘుని యంతరంగమాతంగ మొక్కపెట్టున కట్లు దెగిపడదు గదా. కాకేమి? అప్పుడే నానా ఘుని మోమెల్లెఱ్ఱవాఱుచున్నదో? ఇంతవఱకున్న వేనఘోషయంతయును వెనుకఁబట్టినది. క్రోధావేశమున కనుబొమలు ముడివడిపోవుచున్నవి.

హ—(క్రోధోద్రేకమున లేచి నిలిచి కత్తి నొరనుండి పైకిలాగుచు ప్రకాశముగా) తల్లీ! యిదె నాశపథమాలింపుము. పిరికిపందయై వచ్చి నాతమ్ముని బొరిగొన్న యావరాహహతకు నతలవితలపాతాళాదిలోకమ్ముల నెందు డాగినం బట్టి తెచ్చి యీచంద్రహాసమ్మునకుం బలివెట్టి వాని వెచ్చనినెత్తుటన్ మన దానవనారీకమ్మకు విందొనర్చితీరెద. మాతా, వేయేల? వినుము.

కం॥ హరి నాకదుర్గ నిల్చిన,
పరవశమున హరివిరించిప్రముఖులు పొగడన్
దురమునఁ గూల్చెద నాక
త్తిఁ గల్గను జామ్మ్రజయముఁ దల్లి, కనవే॥

ది—తండ్రీ! యిదిగదా మేటిధీరత. యిప్పటికి నాయంతరాత్మ యించుక శాంతించినది.

హి—[మరల (కం॥ హరినాకెదురై) యన్న పద్యము ను చదువుచు తల్లికి నమస్కరించును.]

ది—(శిరమున చేయిడి) తథాస్తు. నీవాక్యంబు లమోఘంబులగుఁగాక. సంకల్పసిద్ధుండవగుము. నాతండ్రీ పోయి రమ్ము. (దితి హిరణ్యకశిపుఁడు నిష్క్రమింతురు.)

లీ—అమంగళ ముపశమించునుగాత. అయ్యో! యేమిది? యీదానవకంఠీరవంబు నోట నిట్టి యశ్లీలంబు వెలువడె. ఆయర్థంబు గమనింపకయే దితిదేవి యిట్టి యాశీస్సు లొసంగె. ఇదెట్టి యనర్థహేతువో కాకున్న, హరవిరించులు పొగడుచుండ హరి తన కెదురుగ నిల్చి రణమొనర్ప తనకు జయము గలుగునని నానాథుని భావార్థమైనను హరవిరించులు పొగడ హరి తన కెదురునిల్చి రణమొనర్ప తనకజయముగలుగుట తల్లీ, గనుమని స్ఫురించుచున్నదే. (తెరలో)

అది నిశ్చయము ముమ్మాటికి నిశ్చయము.

లీ—(తిరిగి చూచి) ఈయశరీరవాణి యెందుండి వెలువడె? అయ్యో! తుదకీ హరితోడి వైరమెట్టి ముప్పను దేనున్నదో? (పోవును)

పుష్పకేతుఁడను సేవకుఁడు ప్రవేశము.

పు—అది నిశ్చయము; ముమ్మాటికి నిశ్చయము. కాకున్న నీకలకల మేలపుట్టును? దానవచక్రవర్తి దాడివెడలుటయేగాక ముందమరావతిని ముట్టడించునట్టే వారి ప్రసంగమున వినియుంటిఁ గదా. నేనిఁక త్వరలోఁ బోయి మాయింద్రాణికీవార్త నెఱింగించి యామె నే కొండగుహలనో యేముండ్లపొదలనో తల దాఁచుకొనఁబంపవలెను గదా? పాలకడలిదరిం దపంబొనర్చి హరికటాక్షంబు వడసి, వచ్చు వఱకు నసురులకు చిక్కకుండ శచీదేవి మొదలుగ దేవకాంతలనెల్లఁ గాపాడుఁడనియు నీభూలోకమున దానవుల యూహ లెప్పటికప్పుడాయమకు నివేదించుచుండుఁడనియు మా స్వర్గేంద్రుని యాజ్ఞగదా? దానశిరసావహించి నేనట్లు చేయక తప్పునా? ఇప్పుడే స్వర్గమునకు వారు చేరకమున్నుపే నేను బోకున్న తప్పక ముప్పు వచ్చును గానఁ బోయెదను (పోవును.)

1. అంకము. 3. రంగము.

స్వర్గమున నందనవనము.

సఖులతో శచీదేవి ప్రవేశము.

శ—సఖులారా! యెట్టి భయాతురలకైన చిత్తశాంతిని నించు నీనందనవనంబు నెంతని కొనియాడుదు?

శచీ॥ అమరులకేని మొఱ్ఱకు చేష్టలకు వెంచి పతి వియోగంబున పరితపించుచున్న నాకీనందనదర్శనం బెంత యానందమయంబై తోచుచున్నది!
(ధావ్యమాలినింగని)

సీ॥ తరుణీ, కనుమి, కల్పతరులతాశోభిత
నందనంబిది యెంత సుందరంబో!
ధా—స్వర్గరాజ్య భోగసుస్థిర విలాసిని, స్వేదు
నందనంబిది నీకు నపూర్వమెమో?
శ—(సౌదామినితో)
చెలి, వింటె, యవె కోయిలలపల్కులమృతంబు
సోనలై వీనుల సోకుచుండె!
సౌ— నీవాణి, పికవాణి, నెకపక్కులముల చేయు
పికవాణి నీకెంత ప్రీతియయ్యె?
శ— గీ॥ జాజిమల్లె సన్నజాజి సంపగుల సు।
గంధకలితుడయ్యె గంధవహుడు।
మధూధిని—వనవిహారమెంత ఘనతరామోదంబు।
శ— నందనంబు సౌఖ్యమందిరంబు॥

ధా—దేవీ! యిదె యిటు విచ్చేయుము. ఈ పొగడ నీడనున్న చలువరాతి తిన్నెపై నించుక విశ్రమింపుము.

వ—తల్లీ! యట్లొనరింపుము. ఇదె యీపొన్నపూవు లిప్పుడిప్పుడే విచ్చుచు పైకి వెదలుగొన్నో యవ

కమ్మతెమ్మెరలు నీరెండ కేగుదెంచుచు నీతనువల్లి కూడిగంబులొనరించు పరిచారికలవో లెనున్నవి. ఈ తిన్నెపై నించుక యాసీనవగుము.

శ—సఖులారా! నేఁడు పూర్ణిమయగుట గిరిజాపూజార్థము కనకాంబుజంబులకై గదా మనమిట కరుదెంచుట? నేఁడు నూఱు తమ్మిపూల హారంబిడి గౌరిని బరమనిష్ఠంగొల్చిన నాదేవి శోకభయంబులఁ బాపి కోరినవరంబు లొసఁగునని యాచార్యులానతియీయలేదా? కాన మానససరోవరంబునకు మార్గంబు చూపుఁడు. (అందఱు నాదెసకు పోదురు.)

వెనుక తెర తీయఁగా మానస సరస్సు.
దేవకాంగనల ప్రవేశము.

ధా—తల్లీ! యిదే! నిర్మలజలతరంగముల నొప్పు మానస సరోవరం, బిటు విచ్చేయుము.

హే—నాకలోకేశ్వరీ! యీకనకాంబుజంబు లెంత రమణీయములుగ నున్నవో, కంటివా?

శ—కలవాణులారా! యీకాసారంబుఁజొచ్చి కనకాంబుజంబులఁ గోసి వత్తము రండు.

(అందఱును దిగుటను నటింతురు.)

వ—( తడఁబడుచు నడుగువేయు శచి చేయిపట్టుకొని) సురేశ్వరీ, వెఱవకుము. ఇదె యిటు వంగి యున్న యీ పద్మంబుల వంగి కోయుము.

శ—(అట్లొనర్చును)

ధా—(ఆత్రముతో) ఇంద్రాణీ! యీవంక నెన్ని పూలు కుప్పగా నున్నవో యిటు రమ్ము. ఈ పూలన్నియుఁ గోసితివేని నీయొడి నిండిపోవును.

శ—(తలయెత్తిచూచి) అవును. అచ్చటికే పోదము. (ఆ దెస కేగుదురు.)

శ—(నీటిలోనికి వంగి పూలు గోయుటను నటించును)

ధా—(చిఱునవ్వుతో శచిని చూచి)

గీ॥ తల్లి నీమోము బంగారు తమ్మియే ని
జమ్ముగా తమ్మియని తన తమ్మి పీడి
జామనుచు నీటఁ జొరఁ బాఱుచున్న దిచట
చూచితే తేఁటి, యిదియేటి చోద్యమొక్కొ॥

శ—(చిఱునవ్వుతో) చెలులారా! శాంకరిపూజకు వేళ యగుచున్నది. పూలు లెక్కకెక్కువగఁ గోసి యుంటిని, మీఁక చాలును రండు

పౌ—దేవీ! అట్లైన నీయొడినున్న పూలన్నియు నిమ్ము. పదిలముగ మాలం గూర్చెదము.

## ప్రహ్లాద నాటకము.




### రత్నావళి.

సురలందోలుఁడి, గిరివనసీమలసురపతి నెటిబంధించు...
సురవనమున సుందరతరులూడిచి సుమములలోఁ బడద్రుంచి...
చెఱఁగొని యచ్చర తరుణుల నిందు్రనిచేడెను వేగానియోగవలెఁ;
త్వరపడుఁడీ, దనుజాధిపునాజ్ఞ నెదఁ మఱవకుఁడీ దనుజభటుల్॥

(భటులు వనమంతయు నల్లకల్లోలమొనర్చి గంతులు వేయుదురు.)

త్రి—దానవభటులారా! తడవయ్యె నిటకు రంభరం డు, అచ్చరల వెదకవలయును. (పోదురు.)

### 1. అంకము. 4. రంగము.

పాలసముద్రము. శేషశాయి ప్రత్యక్షము. ఇంద్రాది దేవతలు చేతులు జోడించి నుతించుచు ప్రవేశింతురు.

దే—(ఏకగ్రీవముగ)

సీ॥ నీరదనీలశృంగారదేహములోడ
కరుణారసంబొల్కు కనులతోడ।
కటితలంబున నూత్నకనకచేలములోడ
సరిగ పూవుల కట్టుకాటితోడ।
కోమలమణిరత్నకుండలమ్ములతోడ
మె... నవ్వు మోములతోడ
వక్షమ్మునను దివ్యవనమాలతోడనము
శ్రీవత్సకౌస్తుభ...

గీ|| బొడ్డు దమ్మిని నలువాయి బిడ్డతోడఁ।
చెన్నలరుపాప లేని పైవెన్ను మోఁపి।
కన్నులకు పెనుపండువై యున్న నిన్నుఁ।
బొగడఁగా శక్యమా నె మాబోంట్లకభవ?||

వి—(దక్షిణహస్తము, చాఁచి) వేల్పుసత్తములారా,

మ|| దితిపుత్రుండసమానశౌర్యబలుఁడై దిక్పాలకశ్రేణులన్
వెతలం బెట్టుచు నున్నవాఁడనుచు నే వింటిన్ సురాధీశ, వి
న్నతతిన్ గూల్పఁగ రాదటంచుఁదగు సన్నాహంబుతో నుంటి,మీ
వెతలన్ బాపఁగ దైత్యుఁగూల్పుతఱి నే విశ్వాకృతిన్ బూనగన్||

దే—(నతశిరస్కులై) మహాభాగ్యము. ఓదయా
మయా!

ఉ|| అన్యులమా? యనాథులగునాప్తుల, మెన్నఁడు వారు వీరటం
చన్యుల దిక్కుగోరము దయామయ, నీయసమానకీర్తి సా
జన్యత లేమెఱింగి దనుజారి, భవత్ శరణంబు గోరు మా
ధన్యతనిల్పుమా,యభయ దానమొసంగుమా, దైత్యుఁగూల్పుమా||

వి— ఆ|| వె|| భయము మానుఁడయ్య; నయయుతోధనులార,
వెఱపులేదు మీకు వీనివలనఁ;
గలిమి జయము రాజ్యగౌరవంబును మీఁదఁ
గలుగు మీదు సుకృతఫలమువలన||

దే—ధన్యోస్మి! ధన్యోస్మి! ఓ నిరుపమకరుణాభరణా,
మా కెప్పటికిని నీవే దిక్కుగదా.

సీ॥ దిక్కెద్ది యానాఁటి ధీరు వృత్రుని జంపి
నీపాదయుగళంబు ప్రాపుగాదె।
బలమెద్ది యానాఁటి బలుజంభుఁ బరిమార్ప
నీకరుణాదృష్టి నీడగాదె।
తెలివెద్ది మున్నల్ల తెంపుననముచిఁ గూల్ప?
నీదీనరక్షణ నియతి గాదె।
ప్రాపెద్దియానాఁటి పాకుని నణఁగింప?
నీభక్తవాత్సల్య నిరతిగాదె॥
గీ॥ ఓదయామయ, ఇఁక వెరపుడుపుమయ్యా।
నేఁటికిని దయతో మమ్ము నింపుమయ్యా।
ఖలులఁ జెండాడఁగా మదిఁ దలఁపుమయ్యా।
ధరణి భారంబడంగింప మఱవకయ్యా॥

వి—సీ॥ అనిమిషగణమెల్ల నడవులపాలుగా
కడుకష్టములు చెంది యడలునాఁడు।
సంయమిజనులెల్ల జపతపంబులు లేక
దిక్కెవ్వరంచు లోఁబొక్కునాఁడు।
అచ్చరలాదిగా నమరభామినుల క
న్నుల నీరు ధారగా నొలుకునాఁడు।
గోకులవనితాళి గోలుగోలున నేడ్చి
మొఱలిడుచు నొదర్పు దొలఁగునాఁడు।
గీ॥ వానిమితి దనయంతఁ దావచ్చుఁ గాన।
వంతలకునోర్చి సైరింపుడంతదనుక;।

వమ్ముగాదిది నామాటనమ్మి మీరు।
నెమ్మనమ్ములఁ గనుఁడీ ముదమ్ము నెమ్మి॥

శా॥ అంభోజాసను సుప్రసాదమున వీఁడత్యంత గర్వంబునన్।
దంభాకారతనున్నవాఁడు, కుటిలోద్దండ ప్రతాపుండు, సం।
రంభంబొప్పఁగ మిమ్ముఁగాతు; పగదీరన్ సంధ్యయందున్ సభా।
స్తంభాంతర్గతినై వధించెదను మీఁదన్ నారసింహాకృతిన్॥

వాని నాలవపుత్రుఁడు ప్రహ్లాదుఁడు పరమభాగవతశిఖామణి, సాధుమార్గవిచక్షణగుణమణి, నాప్రియభక్తుఁడు కాఁగలఁడు. ప్రభావిశాలుఁడగు నాబాలుపై వాఁడల్గి యెన్నఁడెగ్గులఁగావించునో నాఁడు భక్తవత్సలుండఁ గాన వానిఁబట్టి వధియింతు; ఇది ముమ్మాటికి నిశ్చయము, నిశ్చయము, నిశ్చయము. (విష్ణువంతర్ధానమగును.)

(దేవతలు స్వర్గమునకై పోదురు.)

1. అంకము. 5. రంగము.

భూలోకము. (రాక్షసాంతఃపుర దాసియగు కేశినియను రాక్షసస్త్రీ ప్రవేశము)

కే— (ముందుకు చూచి) అవంక వచ్చుచున్న దెవ్వరో? ధూమలోచనగాదుగదా.

ధూ— (ప్రవేశించి) ఓహో! కేశినమ్మగారా? కుశలమా?

కే—నామాటకేమిగాని, నీవీనడుమ నెచ్చట నగుపడుట లేదేమి?

ధూ—ఏమని చెప్పనమ్మా? నాఁడు రాజుగారు తపోవనమున నున్నప్పుడు సురేంద్రుఁడు మనపురమును ముట్టడించ లేదఁటే?

కే—అవును; అయిన?

ధూ—అప్పుడు నావల్లభుఁడొక్కచేతిమీఁద లెక్కకు మీఱిన దేవతల నెందఱఁగూల్చ లేదమ్మా? (కన్నులొత్తుకొనును.)

కే—(నవ్వుచు) దేవతులకు చావులేదే! నీమగఁడెట్లు చంపెనే?

ధూ—(మూతిముడిచి) ఏమో, గూల్చ కేమిలే? వేలకొలఁదిగగూల్చిరనియే చెప్పుకొనిరి. ఇంతకును దేవతలకు చావులేదని నీ కెవ్వరు చెప్పిరే? ఇవన్నియు పట్టిమాటలు. చావులేనివా రెవరే?

కే—అట్లుకాదు. దేవతలమృతాశనులుగదా? కాన వారికి చావులేదు.

ధూ—అబ్బా, యెట్టిసుద్దులు? ఆయమృతము దిన్నంత మాత్రముననే చావులేకున్న మనరాజేంద్రుఁడేల దినకుండును? కావలెనన్న, ఆయనకాయమృతము నకే కఱవా? ఇదంతయు వట్టి సిలివార్తగాని ని

జముకాదు. అయ్యో! నావిభుఁడిక్కడ తపచేఁ దచ్చినవారితో సంతుష్టినందె ననుకుంటివా? కాదు మూర్తియై యాస్వర్గమునకే చొరఁబడి సురల నురుమాడ సాగెనఁట.

కే—ఏమి చమత్కారమే? అతఁడు స్వర్గమునకేగినట్లు నీకేమి నమ్మకము.

ధూ—ఇంకేమి కావలెను? అదివఱకు కలకలలాడు పురమంతయు కనుమూసిపోలేదా? మనదనుజులగోలయైన వినఁబడలేదా? ఓ! ఒకటేమి? సేనలలో కలకలమా, యూరంతయు కలవిలమా? అంతఃపురములో హాహాకారములా, అసురాంగనల యాలాపములా? అతని యెడబాటుచే నూరంతయు నట్టుడికిపోయినట్లుడికిపోలేదా? ఇంతెందుకు? నావిభుడు మరల నాకంటఁబడకుండుటే నాకు నమ్మకము.

కే—ఏమి మాటకారివే? ఆనాఁడూరంతయు నల్లకల్లోలమగుట నీవల్లభుని కొఱకనుకొంటివా?

ధూ—కాక మఱెందులకమ్మా?

కే—ఎందులకా? ఆనాఁడు సంపూర్ణవిజయుఁడగు సురరాజంతిపురిఁజొచ్చి, నిండుచూలాలై పతివియోగసంతాపభయవిహ్వలచిత్తయై విలపించుచున్న మన

లీలావతీదేవిని చెఱఁగొనిపోవుటకై యట్లుజేసివడిరి కాని నీవిభునికొఱకు కాదు.

ధూ—ఏమేమీ! ఆ నిర్భాగ్యులానాఁడే మనదేవికిని నాకునుగూడ నిట్టి తఱఁగని దుఃఖమును దెచ్చిపెట్టిరా? మఱి వారికిఁదగిన ప్రాయశ్చిత్తము చేయకుండ నిట్లూరకుండిరేమి?

కే—ఎవరూరకుండిరి? అందులకనియేగదా రాజుగారష్ట దిక్కుల దిగ్విజయ యాత్రకై వెడలినారు?

ధూ—అలాగుననా! అట్లయిన మనవారందఱు వచ్చుట నున్నప్పుడు నేనుగూడ స్వర్గమునకుఁబోయి నామ గని వెదుకుకొందును. (పోవును.)

కే—ప్రహ్లాద కుమారుని కొఱకైకులసానిం బిలుచుకొనిరమ్మని మాదేవి నన్ను నియోగించెనుగదా! దీనిమాటలలోఁబడి నేనామాటే మఱచి యిట జాగుచేసితి. పాప, మాబాలుఁడీదినమున పాలైన త్రాగక వెఱ్ఱివానివలె వింతచేష్టలు చేయుచున్నాఁడు. నేఁద్వరగఁబోయెద. (వడిగా పోవును.)

2. అంకము. 1. రంగము.

స్వర్గము. హిరణ్యాక్షిపుని దర్బారు.

హి—(సింహాసనాసీనుఁడై మీసమును మెలివేయుచు ఇటునటు చూచి)

సీ॥ కుక్కుటంబై యల్లబక్క తాపసు పంచ
చేరికూయిడిన యావీరుఁడేఁడి?
మగవారు లేకుండ దగనంతిపురిఁజొచ్చి
మగువలచెరఁగొన్న మాన్యుఁడేఁడి?
ఖండరాలనుగొట్టి కొండ లెక్కలుగోయు
దండిపేర్గొనుబలోద్దండుఁడేఁడి?
కామినికైపోయి కన్నులు వేయి గై
కొని కీర్తనలుగొన్న యనఘుఁడేఁడి।
గీ॥ ఏగుహాలఁ దూఱెనొ? నడవుల నెందుఁజేరె?
ఏజలంబులఁడాఁగె? మఱెచటికేగె?
ఏకొనలకేగఁబ్రాఁకె? మఱెందు దూఁకె?
ఎందుఁజొచ్చెను? ప్రొద్దులింకెందుబుచ్చె?

దే—(నమ్రవదనుఁడై ప్రవేశించి చేతులు జోడించి)

సీ॥ జే జే వరనరాద, శ్రితరక్షణామోద,
జే సురనరలోకసేవ్యపాద।
జే పరాక్రమసీమ, జే వైరిగణభీమ,
జే సుబలోద్దామ, జే సునామ।
జే శాత్రవకుఠార, జే మిత్రమందార,
జే త్రిజగద్వీర, జే సుధీర।
జే సత్కృపాలోల, జే నిశాచరపాల,
జే సుకీర్తివిశాల, జే సుశీల।

గీ॥ జయతు లీలావతీమనోజలజసూర!
జయతు కార్యదుర్వార, కశ్యపకుమార!
జయతు రణశూర, జలనిధిసమగభీర!
జయతు జయతు మహోదార, నయవిచార॥

దేవా శరణు శరణు. ఇదె నీయనుంగు తమ్ముఁడిం దె యున్నవాఁడు. వీని నీయిచ్చవచ్చిన పనికై నియోగింపుము. సిద్ధుఁడై యున్నవాఁడు.

హి—(వికటహాసముతో) ఓరీ పిరికిపందా! ఇంద్రా! శరణని వచ్చి మాచరణముల వ్రాలితివిగాన నిన్ను కరుణించితిమి. శరణార్థులఁజంపుట మానవ్రతంబు కాదు, కాన నిన్నుఁ గొన్ని పనుల శాసించెద.

ఇం—మహాభాగ్యము. ఈదీనుఁడు దేవర యానతి శిర సావహింప సిద్ధముగ నున్నవాఁడు,

హి—నీవిది మొదలీస్వర్గమున నధికారము చూప రాదు. మాయాజ్ఞ నతిక్రమించి వర్తించరాదు. యజ్ఞభాగంబులంటరాదు. తెలిసినదా?

ఇ—చిత్తము.

హి—మంచిది. మాయానతిలేకుండ స్వర్గమున నేడు గైన సడరా, దిఁకఁబొమ్ము. (ఇందుఁ)డు నిష్క్రమించును.)

హి—ఓయీ, విప్రచిత్తూ, నా యానతి నన్నిదిక్కులం జాటం బంపితివా?

వి—దేవా, భవదాజ్ఞానుసారంబుగ నన్నియు నెఱవేర్చితి. భవదీశ్వరత్వమే ముల్లోకమ్ముల చాటఁబంచితిని. హరినామాభిలాషులకుఁ దగిన దండనంబు గావింపఁ గొందఱ భటుల నంపితిని. హరినివాసయోగ్యమ్ములగు జపతపోదానధర్మాదిసత్కర్మల చెఱచుటకొఱకు నన్నిదిశలకుం గొందఱఁ బుత్తెంచితిని. క్రతువిధ్వంసోపాయనిపుణుల నందంద కాపుంచితిని. సూరిజననిర్మూలనకారకులగు శూలహస్తుల మారణకర్మోత్సాహుల గావించి పంపితిని.

హి—మంచిది. విప్రచిత్తూ, నా ముద్దుతమ్ముని జీల్చిపోయిన యా హరిబోతుం బట్టి తెచ్చి నాకరవాలమ్మున ముక్కముక్కలుగఁ జెక్కనంగాని నాయంతరాత్మ శాంతించ నేరదు. ఓసీ నామమాత్రశౌరీ,

కం|| మీనై యప్పుల డాగినఁ,
గానక ధులిపొచ్చఁ బాలకడలి నడఁగినన్,
ఆనీచసూకరాకృతి
తోనవపులఁ బట్టి యున్న తులువ, విడుతునే?

వి—దేవా! ఆహా! భవదీయశౌర్యం బెఱింగియే యొమట నిల్వఁజాలక మనమెంతగా వెదకుచున్న నొక్క-

ని కంటనైనం బడఁజాలక యెందో యొదిగియుండెం. కాక యావిష్ణువే నిజంబగు వీరుండైనచో వీరజనాగ్రంబుగఁ గరంబున కత్తిఁబట్టి దురమొనర్పఁడా? అట్టి సాహసమే యాతఁడొనర్చినచో అప్పుడే యరనిముసమేనియుఁదాళక యాందుండి యొక్క యడుగేనియు నిడనీక మనయువరాజే మట్టుపెట్టక యుండఁడా?

హి—సచివాగ్రణీ! వింటిరా? ఆ తుంటరి తఱుచు గో బ్రాహ్మణులయందుండు నఁట! కాన వాని నిర్మూలనంబుగావింపవలెనుసుమా! దేవాలయంబులుగూడ నుండనీయరాదు. ఋషివాటిక లెందును లేకుండ రూపుమాపుచేయించుచుంటివా? ఆ! చెప్పమఱచితిని. అమానహీనుఁడు ముఖ్యముగ పతివ్రతలగు సతులయందుఁగూడ దాఁగియుండుఁనట. కటకటా! యీపరమద్రోహి కతన శిరీషపుష్పపేశలలఁగూడ కఱకు ఱంపముల పాలొనర్పవలసెఁగదా!

వి—వెఱుక నేల? తరుణీ జనంబును జెఱయుండిద రాదో?

హి—మంచిది. అట్లే గావింపుము.

(ఖడ్గరోముఁడను రాక్షసభటుఁడు ప్రవేశించును.)

ఖ—(పాదములకొరఁగి లేచి నిలచును).

హి—ఓరీ! నీవిప్పుడెందుండి వచ్చుచుంటివి?

భ—దేవా! దేవర యాశ్వీరత్వంబును, దిగ్విజయంబును, అఖండవరలాభంబు నన్నిదిక్కులం జాటుచు నందండ హారిపక్షపాతుల వంతంబొనర్చి వచ్చితి.

హి—భళీ! సేవకా! నీ వట్టి కార్యంబొనర్చితివో చక్కగాఁ దెల్పి మాకర్ణ రసాయనంబుగావింపుము.

భ—చిత్తము. మహాప్రభో!

ఉ॥ ముంచితి సప్తవార్నిధుల, నెత్తితి నుగ్రకరాసిధారలన్,
ద్రెంచితి శాట్ట్రవేవుల, సతీశకుగోయతిలోక మెందుగ!
న్పించిన...... (అని యూరకుండును.)

వి—అవశిష్ట మేల?

భ—

దేవతాధముల ఖీచమడంచెద, పీల్చి పిప్పి గా
వించెద ఖడ్గశోకు ప్రతివీరభయంకరకీర్తినించెదన్॥

(ధూమ్రాక్షుడను మఱియొక భటుఁడు ప్రవేశించును.)

ధూ—(చేతులను జోడించి) జే రాజరాజన్యమకుట కిరీటమణిశోభితాంఘ్రిద్వయా! జే దైత్యాన్వయ పారావారనిశాకర, జయము జయము.

హి—సేవకా! నీ వెందుండి వచ్చుచుంటివి?

భ—నేనుత్తరదిశను వరలోక మెల్ల గిరగిరం ద్రిప్పి వచ్చితి వినుండు.

ఉ॥ కొట్టితి దేవళంబులు లోకకోటికి నెక్కుడుగాఁగ, నింతులం
బట్టితి భర్తృపాదపరిభావనచిత్తల, తత్తరింపనేఁ
బెట్టితి నగ్నికుండముల వేలకు వేలుగ గోసమూహమున్,
గట్టితి కంకణమ్ము ప్రతికక్షజనాంతకనాముఁడోటకున్॥

హి— వహ్వా! ఇంక నాహరి యేమూలలదాగునో యెట్టితావుల కేగునో కనుంగొనెదఁగాక. విప్రజిత్తూ!

చం॥ శరణని వచ్చినాదుపదసారసయుగ్మము పట్టనీ, మఱొ
తెరవునఁ జేరనీవడి దివిన్, జలరాశిని సొచ్చిదాగనీ,
గిరిమరుగైన జేరితమకింపుచు ప్రాణములుగ్గఁ బట్టనీ,
మఱి యెటు కేగనీ, తనదుమానము ప్రాణములింకఁ దక్కవే॥

ఓరీ! లోకులింక నాహరినే యీశ్వరుండని నమ్మి సేవించుచుండిరా?

భ— నిఖిలలోకైకశరణచరణా! దానవకులాభరణా! నీయానతి నోడి యాహరిపేరెత్తఁగలవారెందైన నుందురా? ఇంతయేల? వినుము దేవా!

సీ॥ నీయానతినిగదా నిరతమగ్ని వెలుంగు,
కమలారి చల్లనికాంతినించు।
నింద్రుండు వర్షించు, నినుఁడు దహించుఁ, దా
నిలసస్యముల నెల్లఁ గలుగఁజేయు,।
నీశాసనముమీఱ నెల్లలోకమ్ములు
దగ్ధంబులగు దొరల్ తల్లడిల్ల,।

నీయాజ్ఞ నొక్కింత మీటిదాఁటనేర్తు రే
దిక్పతులాదిగ దివిజులెల్లఁ?
గీ॥ నిన్నుఁ బొగడంగనానె వాణీవిభునకు
హరిహరాదులకైన? భాసురవికాస!
భవ్యచారిత్ర సౌందర్యభరితగాత్ర!
సారగుణధామ దానవసార్వభౌమ॥

హ—సేవకా! నీకనుజ్ఞనొసంగితి నీవిఁకఁబొమ్ము.

సే—చిత్తము. (పోవును)

హ—విప్రజిత్తూ, భోజనసమయమగుచుండెఁగావ

సీ॥ దిక్కులంశోధించి దేవాంగనలఁదెచ్చి
పాదంబులొత్తెడి పనికిఁబంపు।
దక్షిణదిశకేగి ధర్ముని గొనివచ్చి
వడిహజారంబు కావలికిఁబంపు।
ధనదేంద్రులను దెచ్చి తగపల్లకీ కిరు
ప్రక్కల దివ్వటీల్ పట్టఁబంపు।
అనలుని రప్పించి యలమహానసగృహ
మ్మునఁ బాకములమర్ప మనుపఁబంపు॥
గీ॥ స్నానపానాదికములకుఁ జాలినంత।
యుదకమును దేవవరుణుని వెదకిపంపు।
మానిసప్తకమును దెచ్చి మందలించి।
శిబికమోయంగ నివ్వాడె సిద్ధపఱుపు॥

ఆ మఱచితిఁ. వాయుదేవు నంతకుముందు బాటల ప
రిశుభ్రము నొనర్పుమని నియోగింపు; మింత మేమొక
సారి యంతిపురమెల్లఁ దిలకించి వత్తుము.

వి—చిత్తము లాగే. (ఇరువురు నిష్క్రమింతురు.)

(2, అంకము 2. రంగము.)

అరణ్యము. దేవేంద్రుడు, శచి, జయంత
బృహస్పతులతో ప్రవేశింతురు.

దే—(నిట్టూర్పు విడిచి) కటకటా! ఈకటిక రాలలోఁ
బడి నడచుచున్న కోమలాంగి నాయడుగులెంతెంత
పొక్కులెక్కుచున్నవో! హరిహరీ! యిటుపైనిం
కొక్కడుగైన నిడఁజాల. (ఒక చెట్టునీడనున్న బండ
రాతిపైఁ గూలఁబడి పాదములరచేతఁదనుముకొ
నును.)

శచి—(కన్నీరొత్తుకొనుచు) వల్లభా, మీయడుగుల
నాతొడలపై నిడుఁడు. మెల్లగా నొత్తెద. (ఇంద్రుని
దరినాసీనయై యొత్తుచు) హా! మనోహరా!

సీ॥ అతులమధర్మాసనాలంకృతంబగు
మృదుపాదయుగళమా యిదినుకెంద్రి।
వైరిభీకరమైన వజ్రాయుధముఫూని
యొప్పెండుహస్తమా యిదిమహాత్మ।

అఖిలామరాళి శ్రీహరిధ్యానశ్శుధి యిందరి
సౌఖ్యమా యిది దేవ సార్వభౌమ!
రంభాదినిఖిలాప్సరల యాడికంబందు
దేహమా యిది దివ్యమోహనాంగ!
గీ॥ కటకటా! మిండిగాశాసిగములానర్చు!
కట్టడులకోర్చి యారీతి నట్టడవుల!
కడుపునిండిన తిండికి కంటినిండ!
నిద్దురకు దూరముగఁ జేసెనే విధాత!॥

బృ—దేవీ! యూరడిల్లు మూరడిల్లుము. మాగ్గావా-
వమున మన సురేంద్రుఁడెంతయు దస్సియున్న
వాఁడు.

తెరలో రాక్షసభటుల సందడి.

(దేవతలు భయోద్రేకమువనంతుండి వెడలిపోదురు.)

రాక్ష. భ—నానావిధంబుల వెతకివెతకి తుదకామా
దుకాగ్నులను మాత్రమే పట్టఁగల్గితిమి. తక్కిన
వారిజాడ యెందును గావరాదాయె. నీవంక నేవో
మాటలు వినవచ్చుటచే నిందేకైన నుందురనునాస
నిచ్చటికి వచ్చియుంటిమి. ఇంకను రంపీ, యడవి
యంతయు శోధించి చూతము. (పోదురు)

## 2. అంకము. ౩. రంగము.

రాక్షసపరిచారికల ప్రవేశము, నరలోకము.

ధూ—కేశినీ! అంతతొందరగా నేల పోవుచుంటివి?

కే—(తిరిగిచూచి) నాకుఁబనియున్నది. నన్ను వ్యాఁప కుము. కాని నీమగఁడు దొరకినాఁడా?

ధూ—దొరకినాఁడు కాని మునుపటి వేషభాషలన్ని యు మాఱిపోయినవే.

కే—అయ్యో! అదేమి, నీవు నీమగనికి బదులింకొక ని దే లేదుకద!

ధూ—కాదు. కాదు. మఱొకఁడు కాఁడు, నామగఁడే.

కే—నీమగఁడే? అట్లయిన నెచ్చట దొరకినాఁడు?

ధూ—అయ్యో! ఎక్కడట దొరకినాఁడనుకొంటివా? ఆదెవ్వతో యొక యచ్చరయఁట. అది నామగనిఁ దీసికొనిపోయినదఁట. దానిపేరేమో జ్ఞప్తికి రాకున్నది. అదేదో చెట్టుపేరఁట. అముదపుచెట్టా? కాదు కాదు. అవిసిచెట్టేమో?

కే—అదేమి? నీమొగములాగున నేయున్నది. అవిసి చెట్టు ఆముదపుచెట్లను పేర్లచ్చుగలకుండునా?

ధూ—అదికాకున్న నాఁడపచెట్టేమో? అవునదే కావచ్చును.

కే—చాలు చాలు లేవే నీవాచాలత. అనపహారుండు ను గాని చెట్టుంచునా? అదిగాకున్న నరటిచెట్టన్నా పుకాపు నయమే.

ధూ—అదే అదే అదేనోయితల్లీ నిజముగా, నీవివ్వా డన్నదే! ఆదిక్కుమాలిన దేవభామలో దానికేమా యందురఁట.

కే—సరిసరి. రంభయనియా నీయభిప్రాయము?

ధూ—అవునవునదియే. మనభటులారంభనుబట్టి బంధించుకొనిపోయిరి. అది మొఱఁగక రొయిఁడు దానికై చెట్లు గుట్టలు వెతకుచుండెను. నేనును నావిభునికై మాత్రికులలమల పరీక్షించుచుంటిని. మే మిరువురము కలిసికొన, నీవేరిని వెతకుచుంటి వని నేనాతని ప్రశ్నించితి. అతఁడు రంభకొఱకన, నావిభుఁడేగదాయని వానిబలవంతముగఁబట్టి తెచ్చితిని. కాని నావని చెనుకటి మతమంతయు మారి పోయినదిసుమా. మాంసాహారమే మఱచిపోయి నాఁడే. అందుచే రక్తమంతయునుపోయి తెల్లగా బల్లివలె నయిపోయినాఁడు.

కే—సరి సరి, నీభర్తనాఁడే దేవతలచే చచ్చియుండును. నీవాదేవతలలో నొక్కనిఁబట్టి తెచ్చియుందువు.

ధూ—కాదు. కాదు. అటులదు తప్పక నామగఁడేనఁట. మార్గమున మన వశిష్ఠునాసినింగని యూతనింజూపి నేనడిగినదని తప్పక నాతఁడేయని దొంట్టుకూడఁ బెట్టుకొని చెప్పినది. కావలసిన మఱొకసారి నీవు గూడ దాని నడుగవచ్చునురా. (చేయిపట్టి లాగును.)

కే—అయ్యో! నేనిప్పుడు రాను. ప్రహ్లాదబాలకునకు రక్షగట్టించుటకై భూతవైద్యుని వేగతోడ్కొని రమ్మని మాయమ్మగారు నన్నంపినది. నేనాపనికై పోవలయును

ధూ—అదేమి? బిడ్డకేదైన వ్యాధి జనించలేదుగద?

కే—అదేమో! చక్కగ చెక్కిన రత్నపు బొమ్మవలె నున్నాఁడుగాని యేవ్యాధియుఁ గానరాదు. రాజదంపతులకు మనోవ్యాధి, పిల్లవానికి జడవ్యాధి, మాత్రమంతకంత కధికమగుచున్నవి. బాలుఁడు వృద్ధియగుచున్నకొలఁది బుద్ధి మందగించుచున్నది.

ధూ—ఏమి? వెఱ్ఱివాఁడా?

కే—అట్లే తోఁచుచున్నది. తనలోతానేమో యనుకొనును. ఒకొక్కవేళ నహేతుకంబుగ నవ్వుచుండును. ఒకొక్కవేళ వెక్కివెక్కి యేడ్చుచుండును. ఒకొక్కతఱి మూగివానివలె పలుకకున్నట్లుండు షో

యట్టే నిలిచియుండును. ఇప్పుడు మఱొక యుపద్రవము సంభవించినది.

ధూ—అదేమి?

కే—బాలుఁడు పలుకులు గూడఁబలుక నేర్చినాఁడు.

ధూ—సంతోషమేగదా?

కే—అయ్యో! నోటవెలువడునదొక్క హరినామమే.

ధూ—అయ్యో! రాజుగారికెట్టి సంకటము ప్రాప్తించినది?

కే—ధూమలోచనా, నేనింకఁ బోవలెను. (ఇద్దఱును బోదురు.)

2. అంకము, 4. రంగము.

4 యేండ్ల యీడుగల ప్రహ్లాదునితో
లీలావతి ప్రవేశించును. లీలావతి అంతఃపురము.

లీ—కుమారా, యిట్లెన్ని దినములు దిన్నగా నిద్రాహారములనొల్లక కాలంబు గడుపఁగలవు? దినమున కొకపూటయైన, నాకలియని వచ్చి తోడిబాలుర తోఁగూడి యింత యోగిరమారగించిపోవుగదా! ఎట్లెట్లో ప్రాణంబుల నిలుపఁబెట్టికొని యిట్టిచెడ్డ దినంబులు గడుపుచుందువా తండ్రీ? (చుబుకము నాఁకుచు) చూడుముదిగో, అమృతోపమానంబగు నీయమృతకేళిని దినెదవా? (ఒక అరటిపండిచ్చును)

ప్ర—(వందంచుకొని దిక్కుల వెదకును.)

లీ—తండ్రీ! వందేల దినకుంటివి?

ప్ర—( పకపక నవ్వుచు ) ఇదిగో ఈవందారగించెద వా? మాధవా! యిటురమ్ము.

లీ—(ఆశ్చర్యముతో) చూచుచు) తండ్రీ, యింకె వ్వరున్నారు?

ప్ర—ఇదె. ఈ నాచిన్న దేవుఁడు నీకగుపడుట లేదా? (వ్రేలితోఁ జూపును.)

లీ—వెఱ్ఱిగుదిరె రోకలి తలకు చుట్టుమన్నట్టున్నది. అయ్యో! నా వెఱ్ఱిక్కట్టా, ఇందే దేవుఁడున్నాఁడు? తండ్రీ, యిటు చూడుము. నేఁడొక్కింత యూహారమేని దిని యెఱుఁగవుగదా? (చుబుకమును బట్టుకొనఁబోవును.)

ప్ర—(దూరముగబోయి యంజలిఁబట్టి బతిమాలుచు) ఇదిగో! దీనినారగింపవా? నాతోడనాడరావా? నాపై నలుకఁబూనితివా?

లీ—(ఆశ్చర్యముతో చూచును.)

ప్ర—అయ్యో! (ఇటునటుచూచి బిక్కమొగముతో) శ్రీధవా! ఇంతలో నెటుపోతివి? (వెదుకుట నటించును.)

లీ—( వ్రేపాదుని చేరఁదీసి ముంగురులు గోరఁగీరుచు ) నా తండ్రీ, నా మాటవినవా? ( చుబుకమును బట్టి బతిమాలుచు) నాయనా, దీనినొల్లకున్న మఱేమి కావలయునో చెప్పుము. తెచ్చియిచ్చెద, పాలు ద్రాగెదవా?

వ్ర—(అయిష్టముగ తలద్రిప్పును.)

లీ—పోనిమ్ము! అపూపముల నిత్తునా?

వ్ర—(వినిపించుకొనక దిక్కులఁజూచి వెక్కి వెక్కి యేడ్చును.)

లీ—(జాలిగొలుపు చూపులతో తనలో) హా! దైవమా! ముద్దులమూట గట్టుచున్న యీచిన్నవాని మోముచందురునిపై నుంగరములవలె చుట్లు తిరిగిన ముంగురులు చిందులాడ, నందమగువారి యందందకాఁడనఁ దగునావందనునకీ మాంద్యమేల దెచ్చిపెట్టితివి? నానాఁట వీని యున్మత్తచేష్టలతిశయిల్లుచుండెనే గాని యింతయుందకున్నవి. ఇఁక వీనినెట్లు లోకజ్ఞుని గావింపనగునో తోఁచకున్నయది. (అరచేత ఫాలమునుబట్టి క్రింద చూచుచు నుండును.)

వ్ర—అన్నన్నా! నీవేమఱుఁగున నేనుంటివా? నిన్నింతఁ నియుకుండఁ బట్టుకొనలేనా? (వాతిపోవును.)

లీ—(పెదవి విఱిచి) కట్టా! నాకర్మమిట్లుండె (వెంటఁ బోవును.)

2. అంకము. 5. రంగము.

హిరణ్యకశిపుని శయనగృహము. హిరణ్యకశిపుఁడు లీలావతి ప్రహ్లాదుఁడు నిదురించుచు ప్రవేశము.

హి—(కలలో శ్రీహరినృసింహాకారమున కన్పించుటచే అదరిపడిలేచి దిగ్భ్రమమున దిక్కులు చూచుచు) హా! సచివులార! వీరభటులార! దనుజకుమారులారా! రండు రండు. ఈదైత్యారిని పోనీక పట్టుకొండు. ఏదీ నాచంద్రహాసము? ఎక్కడ? (తొట్రుపాటుతో నటునటు వెదకును)

లీ—(అదరిపడిలేచి) ప్రాణేశ్వరా! యిదేమి యిట్లు పలువరించుచుంటివి?

హి—(వినిపించుకొనకయే) హా! పాఱుబోతా, నాకిరీటములెటు గొనిపోయితివి?

లీ—అమంగళముపశమించుగాక! నాథా! నీకెగ్గు గావించి తన ప్రాణాశను త్యజించిన సాహసికుండెవ్వఁడు?

హి—(వినకయే) ఓరీ! ధీర్వాగ్రేసరా, పిరికిపందవై నీచసూకరంబవవుట చాలదా? మరల నీయుడవి మెకంబవై నాకడ కేతెంచితివా? (చెవియొగ్గి)

ఆ! ఏమనుచుంటివి? ఇప్పుడు మృగరాజనై తినని యా? ఇదియా నీగర్వము. ఈ రాక్షసింహము నెదుర నీ నరసింహాకృతి పెద్దయనుకొంటివా? ర మ్మి రమ్మి. ఇప్పుడే నీక్రొవ్వు అణఁచెదను. (మరల కత్తికై తత్తరమున నిటునటు వెదకును.)

లీ—(అడ్డమువచ్చి) వల్లభా, కలగని యుల్లిలపడి చెందు చుంటివా? ఇందెవ్వరుండిరి? ఇది నీశయనాగా రము. ఇచ్చటికెట్టి నిశీథమున నొరులు రాఁగలరా?

హి—(తెలివిపొంది పెజ్జపైఁ గూర్చుండి యిటునటు చూచుచు) ఆ! యేమి? నేఁగన్నది స్వప్నమా? లీలావతీ, నేఁడొక పాడుకలఁగంటి.

లీ—నాథా! ఏమని?

హి—ఆ నీచుఁడు, ఆ దుర్మదాంధుఁడు, ఆ పాడువిష్ణువు సగము సింహాకారంబునను, సగము పురుషాకారం బునను వచ్చి అదరుపాటున నాపైఁబడి కదలనీ యక గట్టిగాఁ బట్టి నాకంఠంబు నూడఁబెరికి వ్రేల్ల దుని శిరమున నిడి వాని నాభద్రగజంబుపై నధిరో హించి యూరంతయుఁ ద్రిప్పఁబంపెనట.

లీ—(భయముతో చూచుచుండును.)

వ్రి—(తనలో) మాధవా, అప్పుడే నన్ను విడిచిపో దువా, యిటురావా?

హి—(అదరిపడి చూచును)

లీ—(ప్రహ్లాదు కౌగ్గిలించి) నాచిన్నయన్న, నీవేల యి ట్లు పలవరించెదవు?

హి—(లీలావతియొద్దనున్న ప్రహ్లాదుని అందుకొని) తండ్రీ! నీకేదైన కల వచ్చినదా?

ప్ర—లేదే! (తండ్రి యొడినుండి దిగి ఒక కంబము మ ఱుఁగున కేగి నవ్వుచు) మరల నిచ్చటనుండి పాఱి పోవఁదలఁచితివా? నిన్నొకసారి పోనీయను చూడు. ము. (హిరణ్యకశిపుఁడు నిశ్చేష్టుఁడై చూచుచు నూరకుండును.)

లీ—(ప్రహ్లాదుని దగ్గఱగాఁదీసి) ఇట్లేల యూరక కల వలవరించెదవు బాలకా! యిందెవ్వరుండిరి?

ప్ర—ఇదే, యీచిన్ని దొంగ (వ్రేలితోఁజూపుచు) ముగవహరా, యిటు రమ్ము. నీశిరమున కిరీటమొకిం చుక యొఱిగియున్నది, సవరింతును. (అట్లు చేయు ట నటించును.)

లీ—తండ్రీ! నీవన్నట్లు హరి పోటుదొంగయే. అట్టి దొంగ వానిని దొరవు జేయుచుంటివి ఇదేమిపాపము?

హి—(అసహ్యముతో) ఔరా! అయిదేండ్ల బాలుని కిట్టి దుర్బోధనం బెవ్వరు గావించిరి? ఆ పరమనిచుం డగు హరిని స్మరియించు టెట్లలవడె?

ప్రి—(చేతులుతట్టుచు పాటపాడును.)

1. రారా, జగన్మోహనా, ఖగవాహన, రారా పతితపావన।
రారా, అలిగిపోయేరా, యింతజాలమేరా? సుధీర, అఘదూ
రా, సుకుమార, యిటు॥ రారా॥

హి—(అదరిపడి) ఛీఛీ! యివేటిపాటలు?

ప్రి—(వినిపించుకొనక చిఱునవ్వుతో)

2. ఏలా, నాతో నాడవేలా, కరుణాలవాలా,
మేలా? సుశీలా, జాగేలా? రమాలోలా, ॥రారా॥

లీ—(ప్రహ్లాదుని చుబుకమును బట్టి) ఇట్టి చెడుపాటల నెన్నఁడును బాడకుము. మఱేవియైనఁ బాడుకొనుము.

3. అన్నా, నాతోడఁగూడకున్న, నేతాళజాలనన్నా,
నీకన్న, దిక్కెన్న , తేరన్న, యిటు॥ రారా॥

హి—(పెదవి విఱిచి పెడమొగముతో) ఇంక వీని బుద్ధి చక్కఁబట్టుట కల్ల. వీఁడు తప్పక దండనలపాలుగావలసినదే.

లీ—ప్రాణేశ్వరా! ఇంచుక శాంతింపుము. ముక్కుపచ్చలారని ముద్దుపాపని దండనలపాలుగావింపఁ దలపోయుచుంటివా?

ప్రి—(పకపక నవ్వుచు) శ్రీధరా! నా వెనుకనుండి వచ్చి కన్నులను మూయుచుంటివా? (చేతులు తీయుట నటించును)

హి—(అసహ్యముతో) నేనింక నీని చేష్టలంగని సహింపఁజాల! (వెడలిపోవును)

లీ—(ప్రహ్లాదు సకు_నఁజేర్చి) అయ్యో! వెట్టికట్టా! నీకన్నలివ్విడెవ్వరుమూసిరి? తండ్రీ, మూఁడుదినంబులై మూఁతిదెఱవక యిట్లీ యీ వెట్టి చేష్టల కాలంబువుచ్చుటచే నీచిన్ని మోముదమ్మి యెంత వాడిపోయినది? ఈకటికయుపవాసంబుల నెన్నిదినముల ని కాలంబుగడపఁగలవు?

ప్ర—(ఆతురముతో) అన్నా! మరల పాఱిపోవుచుంటివా? (వెనుగ్రి పోవును.)

లీ— హా! విధి వ్రాత. త్రిభువనోదగ్రమూర్ధాభిషిక్తుండగు రాక్షససార్వభౌముని ముద్దు బిడ్డండయ్యు నీబాలుండనుదినంబును బొట్టనిండఁ బట్టెఁడన్నంబునకైన నోచఁడాయెఁగదా? అయ్యో! ఇట్టి వెట్టిపాపనికై విసువని చింతనొంద విధి నానొసట వ్రాసెకదా. నేనేమిసేయుదు? పడఁగలపాట్లెల్ల పడుచున్న నీబాలకునికడ నిరర్థకంబులగుచుండెనే? ఎందఱో వైద్యులు చికిత్సలొనర్చిరే? భూతవైద్యులనేకులు మంత్రతంత్రంబులొనరించి ప్రాణంబులు విసిగిపోయిరి. కట్టిన రక్షరేకులనేకంబులు. పెట్టిన యంగరక్షలా వేలకొలందులు? ఇఁకేమి సేయుదగు? వానికర్మమెట్లున్నదో? (పోవును)

శ్రీ

# ప్రహ్లాదనాటకము.

## తృతీయాంకము.

### 1 రంగము.

విష్ణులోకము. లక్ష్మీదేవి నారదుఁడు ప్రవేశము.

ల—నారదా! ఆదానవుని యాగడ మెంతగా మీఱుచున్నదని హరివలన నేను వినుచుంటి.

నా—తల్లీ! నీవల్లభుఁడింక నుపేక్షించిన నింక లోకంబులు నిలుచునా? ఆయసురుని వరగర్వమేమడిగెదవు?

చం॥ వడఁకెదరష్టదిక్పాలురు; వాయువువీవఁగనోడు నిచ్చమై;
జడియుదురగ్నిసోములు నిజంబగు తేజముచూప; వార్నిధుల్
తడఁబడిభంగముల్విడిచి దారియొసంగు జడత్వమూనుచున్;
గడగడలాడుదిక్కరులు; సగంబె వెలింగెను నగ్నిభీతమై॥

దేవీ! యింతయేల? ఎల్లలోకముల్లకల్లోలముగఁ దల్లకిందులగుచున్నవి. యమలోకమున క్రొత్త లేఖరియగు దానవునిచేతివ్రాఁత నే వ్యయముగఁజూచివచ్చితి, నిదే యాలింపుము.

సీ|| సురపానమత్తమదగ్రగర్వులకు నెల్ల
సురలోకరాజ్యము స్థిరపదంబు।
అనృతాదిచోరకర్మాభిలాషులకెల్ల
నప్సరఃకేళీసుఖావహంబు।
పతిదైవతావ్యోగభంగపరులకెల్ల
ఘనపిశాచవిలాస మనవరతము।
గోశిశుహత్యాదిఘోరకర్మలకెల్ల
కైలాసవాసభోగంబువంబు।
గీ|| ననుమతీపవిత్రగంగాస్నానమునిండె।
మాత్రమునరారివరులఁ జేవాశ్రితులముగా।
చిత్రగుప్తుల చిట్టాలు శీర్ణమయ్యె।
పుణ్యలోకంబులఘుతిమో పూర్తినలరె||

ల—కటకటా! యెట్టి దాయనాము?

నా—అన్నా! నరలోకవాసుల మొఱలింక నీవరువియు ల్లంబు గణింగింపఁజాలకుండెనా? హరిహరీ.

సీ|| పాపాత్ముల నట్టెపట్టిపెట్టెడిపాట్ల
కాహాకరవంబు మిన్నంటుచుండె।
దేవళంబుల నొక్కటీగను గూల్పఁగ
గుభగుభధ్వనుల దిక్కులు వడంకె।
మునిజనాశ్రమములెల్లను ధ్వంసముగాఁగ
పెక్కువిధుల ఘోషపిక్కటిల్లె।

పతిదైవతల జెఱఁబట్టి బాధింపఁగ
కన్నీరు దరిలేక గాఱుచుండె।

గీ॥ అమరపతి తేజరిలు సుధర్మాసనంబు।
దితిజపదసంగతిని హతతేజమగుట।
మదదనుజలోకమునకట్టి పదవిహెచ్చె।
సురవరుల కక్కటా! వనిశరణమయ్యె॥

ల— అబ్బబ్బా! యెంతఘోర మెంతఘోరము! నారదా! మనమిప్పుడేచని యీదురంతమెల్ల నాదను జారికెఱిఁగించి యాక్రూరదానవవధాచరణమునకై వేగిరించి వత్తము రమ్ము. (లక్ష్మి ఆతురము లోఁ బోవును.)

నా— ఆహా! పరహితార్థరతుల చరితంబు లత్యద్భుతంబులుగదా? ఈయమకరుణావిశేషమసామాన్యము. భూతదయయో పూజ్యనీయముగదా! కాకన్న

కం॥ క్రూరుఁడు రక్షోవీరుఁడు
సారసభవువలనఁ బొందెచావని వరమున్।
ఏరీతి విభుని జంపఁగ
నేరుతనన, దిట్టి మంచి నెలఁత గలుగునె॥

(నారదుఁడు నిష్క్రమించును.)

3. అంకము. 2 రంగము.

హిరణ్యకశిపుని రహస్యాలోచన గృహము.

హిరణ్యకశిపుఁడు అర్ధాసనమున నాసీనుఁడై ప్రవేశము.

హి—(భయోత్కంపమున తనలో) ఆహా! నామనంబునకిట్టి వికారంబు జనించె, నిదేమివింత? దుర్లభవరలాభుండనై యెదురులేక ముల్లోకమ్ములంగెల్చి యప్రతిహతవీర్యుండననిపించుకొన్న నాకీవిష్ణువు గిష్ణువు మొదలగు నధమాధములోక కీడొనర్పఁగలవారా! అట్లుగానున్న, విరించివరంబులిడుట యసత్యంబా! లేక, వసచెడునా? ఆటుగాకున్న నాతపంబే దబ్బరా! నేనూరక యట్లు భ్రాంతిచెందితినా! ఛీ! ఛీ! అట్లేటికగును? ఇదేటిమాట? ఆహరియుగీరియు నాయెదుర నిల్వఁగలరా? (కంచుకతల వ్రాల్చి యూరకుండి మరల తలయెత్తి) అబ్బబ్బా! యెంత ధైర్యము చెప్పుచున్నను నాయంతరంగమేటికో యెన్నటి దుస్స్వప్నంబునే యనుక్షణంబును అనుభవమునకుఁ దెచ్చుచు నూరటగలుగనీయకున్నదేమి? నాఁటి భీకరాకారమొక్కటియే గాదు, హరి నానారూపముల నాఁపైబడుచున్నట్లే తోఁచుచుండె. (మరల తలవాల్చి కొంతయూరకుండి)

ఛీ! ఈపిరికిపందకై నే వెఱవం దేననా? వీనినీపారి నా చెంతకు రానిమ్ము, చూపెద నాపౌరుషము. (ముందునకుఁ జూచి) విప్రోత్తముఁ డింకను రాకుండుటకేమి హేతువో? (విప్రోత్తము ప్రవేశించును.)

వి—(తనలో) ఏటికో దానవేశ్వరుం డతి దీర్ఘవిచారమగ్నుఁడై కన్పట్టుచుండె? ఏవేళ చూచిన, నాతని వెనుకటి గంభీరభావంబు గాన్పింపదాయె. కారణమూహింపనేరకుంటి. (కనుబొమలు పైకెత్తి) ఓహో! తెలిసినది. ప్రహ్లాదబాలకుని హరిభక్తికై యాలోచించుచుండెనో? ప్రవేశించి చూచెద (ప్రకాశముగ) దేవా! ఎల్లలోకమ్ములనవలీలం స్వాధీనమొనరించుకొనిన మేటిప్రభుండ, వీవిట్లు చింతించుచుండఁదగునా?

హి—(తలయెత్తి చూచి) ఓయీ! అస్మద్వంశసంభూతుండగు బాలునకీ యాచారవిరుద్ధంబగు ముగ్ధభావంబెట్లలవడె?

వి—మహారాజా, చిఱుతప్రాయంబుకతన లోకజ్ఞానమెఱుంగ గాకుండె

కం॥ తలపోయ జలాంతర్గత
జలచరము విధాతి లోకసంగవిముఖుఁడై।
యలరారు నిసుతుండెటు
తెలియంగలఁడో క్రౌర్య శౌర్యనీయుతిఫణితిన్?॥

కాన మన చిరంజీవిన్ విద్యావిశారదుం గావింప సక
లార్థచతురమతి కాఁగలండు.

హి—(తలపంకించుచు) అట్లయిన సేవకుని పిలిపిం
పుము.

వి—ఎవడురా అక్కడ? (ముందుకు చూచును.)

సే—(ప్రవేశము) దేవా!

వి—ఓరీ! నీవిప్పుడేచని లీలావతీదేవి యంతఃపురమున
నున్న ప్రహ్లాదబాలకునిందోడి తెమ్ము.

సే—చిత్తము (పోయి ప్రహ్లాదునితో పునఃప్రవేశము)

ప్ర—

శా॥ రారా నీరదనీలదేహా, యిటురారా శ్రీమనోనాయకా।
రారా మండితకుండలాళికటకా, రారా వికుంఠాధిపా।
రారా సారసపత్రనేత్రయుగళా, రారా జగద్రక్షకా!
రారా భూరిభుజంగతల్ప, యిటురారా భక్తసంరక్షకా॥

హి— (సేవకునియొద్దనున్న బాలునందుకొని యొడిలో
నిడుకొని ముంగురులు సవరించుచు నొక ఫల
మును జూపి) ప్రహ్లాదా! నీకీమధురఫలము గావ
లెనా?

ప్ర—(చూచి నిరాదరమున నూరకుండును.)

హి—(ఒక పూలమాలికనుదీసి) తనయా, యిది ర
మ్యముగనున్నదా? చూడుము.

ప్ర—(చిఱునవ్వుతో నూరకుండును.)

హి—(గ్రహ్లాదుని చుబుకమునుబట్టి) తండ్రీ, మఱి నీ కేమి కావలయునో చెప్పుము తెప్పించెద. ఏవేని విలువగల భూషలంగోరుచుంటివా? దువ్వాలువలుగా వలయునా?

ప్ర—జనకా? నిరుపయోగంబులగు నిట్టివి నాకేల?

గీ॥ ఫలము లేటికి హరిపదోత్పలములున్న।
పువ్వు లేటికి నాసామి నవ్వులున్న।
భూష లేటికి హరిమృదుభాషలున్న।
వలువ లేటికి మధువైరి చెలిమియున్న?॥

హి—(వ్యగ్రభావముతో) ఇదేమి పుత్రా! యివేటి మాటలు? ఆ పాడువిష్ణువును కలనైన స్మరించరాదు. వానిపేరెన్నండును నెత్తకుం. ఇటుచూడుము, యీ యతిరసంబుం దినంగోరుచుంటివా? యిది నీకిష్టమా?

ప్ర—(వద్దని సైగచేయును.)

హి—తనయా! అమృతోపమానంబగు నీయతిరసంబు నీకక్కఱలేదా? ఇది యెంత నిరసనపదార్థమా? ఇదేమి? కుమారా! నీవంటి పసివాండ్రిసించున విఏయకావే?

ప్ర—నాయనగారూ!

గీ॥ సారమగు విష్ణుసేవానుధారసంబు।
ననయమును గ్రోలు నాకేల యతిరసంబు?।
చిక్కెనా హరిపదసరసీజసేవ।
నామృతంబున కీడౌనె యతిరసంబు?॥

హి—(మోము జేవురించుకొనుచు) పట్టీ! యిట్టిను దులప్రయోజకులై శక్తిశౌర్యంబులుడిగిన ముదుసళ్లగు నరాధములనఁదగినవికాని, నీవంటి దినదినప్రవర్ధమానుండగు రాపట్టికిం జెల్లునే? ఛీఛీ! యింక నీ వాహరిని స్మరింపకుము.

వి—ప్రహ్లాదకుమారా! ఇదే నామాటలించుక మన్నించి వినుము. ఆహరి మన రాక్షసకులవిద్వేషి. అదియునుంగాక నీపిన్నతండ్రిని, అనంతవిక్రమాదగ్రుని, నీజనకునికొక పెట్టనికోటయగు మహావీరుని, నిష్కారణవైరమున వచ్చి ప్రాణంబుల ముచ్చిలి పోయినాఁడు గాన నట్టి యరినిగొల్చుట పౌరుషహీనంబుకాదా? అట్టివానిపై పగఁ బూనఁదగును గాని భక్తిఁ జూపఁదగునా?

ప్ర—(వినమ్రుడై చేతులుమోడ్చి) సచివాగ్రణీ! ఆ భక్తసులభుండీరక్కసికులంబున కపకారియే గావచ్చుఁగాని, నాయంతరంగమేటికో యా శ్రీకాంతుని సేవాభిరతులఁ దీవ్రముగఁ దగిలియున్నది. ఎంతటికేనియుఁ దిరుగకున్నది. నేనేమిసేయుదు?

హి—(క్రూరదృష్టితో ప్రహ్లాదు నొడినుండి క్రిందికిఁ ద్రోసి) ఓరీదురాత్మా! నీవాహరిని సేవించుట మానవేరవా? కానిమ్ము, నీవిఁక నాదురాత్ముని పేరెత్తితివా, నిన్నీకత్తి కెరచేసెద, చూడుము. (కత్తి యొరనుండి లాగును.)

వి—నిరుపమోదారయశోవిశాల, నోరెజుంగని కసుగాయపై నింత యాగ్రహమా? విద్యాభిరుచి గన్నకొలఁది నీతఁడే ధీరమతి కాఁగలండు.

కం॥ చదువు నెఱింగిన, దానన్
సదమలవిజ్ఞానమొదవు జనులకుఁగానం।
జదివినకొలంది ననుభవ
మెదనాఁటఁగ దిరుగుఁదానె యిహసుఖపరుఁడై॥

హి—(కత్తిని దించి) మంచిది. గురుపుత్రుల నిప్పుడే పిలిపింపుము.

వి—సేవకా!

సే—మహాప్రభో.

వి—ఓరీ! నీవిప్పుడేచని శుక్రాచార్యతనూజు చండామార్కులం దోడ్కొనిరమ్ము.

సే—(పోయి చండామార్కులతో ప్రవేశము.)

హి—ఆచార్యనందనా! యీపీఠ మలంకరింపుము.

చం—(ఆసీనుండై) రాజశేఖరా! మమ్మేటికిఁ బిలువ నంపితిరో?

హి—మహీసురపుంగవా! (ప్రహ్లాదునిఁజూపి) ఈ బాలుం డస్మత్సూజాతుండు. ప్రహ్లాదకుమారుండు.

చం—(ప్రహ్లాదునిఁగని సంతోషముతో) కుమారా! ఆయురారోగ్యైశ్వర్యాదియుతుండవు గమ్ము. భవదీయజనకానంతయశోవిరాజితుండవు గమ్ము.

హి—గురుపుత్రా, అదియే ఈబాలునికడనున్నకొఱంత.

చం—అట్లానతిచ్చెదరేల? ఈముఖవికాసంబు, ఈ మృదులగాత్రంబు ఈతని యశశ్చంద్రికలఁ జాటుచుండ నీబాలుండేటికల్పమతి కాఁగలండు?

హి—భూసురాగ్రణీ! ఈ పాపండాజన్మజడస్వభావుండు. రక్షోవంశార్హసముదారమానసుండుగాక మునిజనార్హంబగు మానంబుఁ బూనియున్నవాఁడు. ఇంతయేల? నిద్రాహారంబులనైన నియమితకాలంబున నిర్వర్తింపఁబోఁడు.

చం—దానికేమి? ఇంచుకమంచిమాటలచే బోధించిన నానాఁట వికసితాంతరంగుండు గావచ్చుఁ గాన విద్యారుచి గలిగించుట యుక్తము.

హి—అగునట్లే దోఁచుచున్నది. విద్య నెఱిఁగినకొలఁది విషయాభిలాష గాఁడా?

చం—ఇంకనందులకు సందేహమా?

గీ|| విద్య గని దాన సహభోగవితతి దెలిసి।
విషయలోలత్వ మెదను భావించి మించి।
తత్సుఖానుభవం బాత్మఁ దగిలెనేని।
విడుచునే యెట్టిమత్తుఁడు జడుఁడైన||

(ప్రహ్లాదునితో) కుమారా, పోయి మీతండ్రిగారికి నమస్కరించి రమ్ము.

ప్ర—(అట్లుచేయును)

హి—(లేవదీసి చెక్కిలినొక్కుచు) నామూలధనమా, ఆచార్యులందిరుగాడక యఖిలశాస్త్రవిదితుండవుకమ్ము. ఎట్టితఱినేని యొజ్జలఁ దిరస్కరింపఁబోకుమా. పుత్రా, గురువుల హితబోధనంబుమదిని డి చతురమతివిగమ్ము. ఏమి! గురువాక్యముల శిరసా వహించెదవా?

ప్ర—(తల ద్రిప్పుచు సమ్మతిని దెల్పును.)

హి—(గురువుతో) ఆచార్యతనూజ! ఈ చిఱుతపావనిపై ననవరతదయామతివై యెఱుఁగనేరని యర్థంబులఁ దేటమాటలచేఁ దెలియఁబఱుపుమే కాని జడుఁడనియు మందుఁడనియు నిందావాక్యంబుల నిష్ఠురంబు

లాడకుమా. సూక్ష్మగ్రాహి గాకుండెనని శిక్షింపఁ బోకుమా. బుజ్జగించి బోధింపుము. ఈశిరీషపుష్పకోమలగాత్రుఁ డించుకేనియుం దండనకుం దాళజాలఁడు సుమా. ఎట్లు లాలించి పాలించెదో? (ప్రహ్లాదుని ముద్దుగొని) తండ్రీ, గురుపుత్రులతో నేగి సర్వార్థవిదితుండవై తిరిగి రమ్ము.

(గురువునకప్పగించును. అందఱు నిష్క్రమింతురు.)

## 3. అంకము. 3. రంగము

గురుగృహము. 7 యేండ్ల యీడుగల ప్రహ్లాదుఁడు సహాధ్యాయులతో ప్రవేశించును.

ప్ర—

క॥ శ్రీరమణాకరుణాకర।
నారాయణభక్తవరద నరకవిదూరా।
పారావారవిహారా।
ధారాధరసమశరీర ధర్మవిచారా॥

దీర్ఘరోముఁడు—ప్రహ్లాదకుమారా! నేఁడు నీయుపన్యాసమును వినుచు బాఠమును వర్ణింప మఱచితినయ్యో! అయ్యవారు వచ్చువేళ యగుచున్నది. అతఁడెట్టి శిక్ష విధించునో?

ప్ర—సఖా! వెఱవకుము. ఆనేరము నాయది కాని నీయది కాదు.

అరుణాక్షుఁడు—రాజపుత్రా! వానిశిక్ష నీవేల పొంద వలె?

గజకర్ణుఁడు—ప్రహ్లాదకుమారా! నీవీతని చదువుకొనవద్దంటివా? మేమందఱము విన్నవారము కామా? వీనివలె చదువ మఱచితివా?

దుష్టకేతుఁడు—ఇదియొకనేవముకాని శ్రిద్ధయున్నచో వీనికీమాటలడ్డుపడునా?

లంబవక్త్రుఁడు— రాకుమారా, యీవేషముల కేమిలే, గురువుగారికడ మనమాటలమాటే తలపెట్టకుము. వానిశిక్షల వానినే పొందమనుము.

దుర్ముఖుఁడు—అవును. నిజమే. అయ్యవారడిగిన నేనే మాటల వెఱుఁగననుము.

ప్ర—హరిహరీ! అట్లనృతమాడఁదగునా?

అజముఖుఁడు—నెచ్చెలీ, యింతమాత్రపు టనత్యమున కే యింత వెఱపా.

ద్విజిహ్వుఁడు—నీపై నేరము రానున్నతఱి నొక్కింత బొంకినఁ దప్పా?

తామ్రకేశుఁడు—అనృతదోషమునకింత వెఱచిననటుపై నాచార్యు పిడిగుద్దులు సౌఖ్యముగ నుండు ననుకొంటివా?

ప్ర—ఎట్టి శిక్షల నైనఁ బొందఁగలనుగాని యసత్యమా
డ సాహసింపనేర. అట్లన్న పాపము రాదా?

అజ—పాపము వచ్చిన చేయునదేమి?

ప్ర—నరకమునఁ గూలఁద్రోయును.

గజ—నరకమనఁగ?

ప్ర—జీవులు తా మొనరించిన పాపమనుభవింపఁదగిన
చోటు. ఆయాపాపములకుఁ దగిన బాధలందనుభ
వింతురు.

ద్వి—పాపమనఁగ?

ప్ర—విధినిషేధమగునది.

లంబ—అనఁగ?

ప్ర—అనఁగ, సర్వేశ్వరునికి సంబంధింపనిది.

అసు—సర్వేశ్వరుఁడనఁగా నెవరు?

ప్ర— మన మనుదినము పాడి భజించి యొవని వేఁడు
చుంటిమో యాతఁడే.

దుష్ట—ఆతఁడెందున్నాఁడు?

ప్ర—ఇందునందనక సంతట నిండియున్నాఁడు. సూ
దిమొనయంతయైన నాతఁడు లేనిచోటు లేదు.

గజ—అట్లయిన నాతఁడు నాయందున్నాఁడా?

ప్ర—ఆ! అందఱియందున్నాఁడు.

ద్వి—ఉన్నచో నాయందాతని మాపుము.

ప్రి—మంచిది. నీవిప్పుడు గురుగృహమునఁగదా యుంటివి? నీయింట నెన్నిగదులున్నవో నీకుఁదెలియుదా?

ద్వి—తెలియుకేమి? మూఁడుగదులున్నవి.

ప్రి—నీవిప్పుడది యెట్లు తెలిసికొంటివి?

ద్వి—నాకన్నులతో నేనిదివఱకు చూచియుండుట వలన.

ప్రి—మంచిది. ఒకసారి మనమేదైన చూచియుండిన నది యేవేళఁదలఁచిన నావేళ నంతరంగమునకు జ్ఞప్తికి తేఁదగిన యఖండశక్తికేమందువు?

ద్వి—తెలివియనదియే గదా.

ప్రి—అగును. ఆ తెలివి దేనివలనఁ గలుగుచున్నదో అదియే తత్వజ్ఞులచే జీవుఁడని వాడఁబడుచున్నది.

అరు—దైవమనునదదియేనా?

ప్రి—అగునదియే. ఈసృష్టిని గలిగింపను మరల లేకుండను చేయుచున్నది.

దు—అందఱయందా తెలివి యున్నచో మనమందఱు మేల నీసృష్టిని చేయలేకుంటిమి?

ప్రి—అది రెండువిధములుగ నుండు. ఒకటి యీదేహమే తాననుకొని యీదేహేంద్రియములకు వశమై వాని పరిచారికవలె నుండి తన యనంతశక్తిని తాను మఱచిపోవును. మఱియొకటి యీ

దేహేంద్రియములను తన స్వాధీనమున నుంచుకొని తన యిచ్ఛకై వానినుపయోగించును.

అజ—తన యిచ్ఛయేది? దేహమిచ్ఛించునదేది?

ప్రి—విషయాభిలాష దేహేంద్రియముల కిష్టము. వీనికధిపతియగు తెలివి పరమేశ్వరుని యిచ్ఛ నను సరింపఁగోరును.

అరు—పరమేశ్వరుఁ డేమి వాంఛించును?

ప్రి—స్వార్థరహితము. పరహితము.

లంబ—ఇక మీధోరణి కట్టిపెట్టుఁడు. అదిగో, అయ్యవారు వచ్చుచున్నారు. (అందఱు తిరిగి చూచి గొంతెత్తి చదువఁబోదురు.)

(చండామార్కులు ప్రవేశింతురు.)

చం—బాలకులారా! యేవీ, మీపాఠముల నప్పగింపుఁడు.

ద్వి— తల్లిదండ్రులకన్న దైవంబుగలఁడె
లోల్లోన వెదకి యియ్యలను చూడంగ?।

అ— ఆప్తహీనునికన్న నధముండు గలఁడె
వ్యర్థంబుగాదొక్కొ వాని జీవనము?।

లంబ—ధనమున్న బంధులే తన కెల్లవారు;
ధనము చెల్లిన నేరు తనకు లేరధిప।

దు— ఎప్పటికేకోక నేని ప్రస్తుతమొ
యుప కృతి కామాట లాడుమీ సుమతి।

గజ— స్థానబలంబున్న తనుబల మేల?
కాన స్వస్థానసంగతి వీడరాదు।

దీ— చెలికాడె చుట్టమౌ చెడియున్న వేళ;
చెలిమికన్నను మిన్న సిరియెందుఁ గలదె?।

దుష్ట— తెలతెలవారంగ తెలివంది లెమ్ము,
తలిదండ్రులకుఁ దొల్త దండంబులిడుము।

అజ— ఎందైన సంతుష్టి నెడయక సిరుల
నందంగ తలపోయనగు భూవిభునకు।

తామ్రి— పాలు చక్కెరకన్న ప్రాణముల్ తీపి
చాల యోచింపంగ సకల జీవులకు।

ప్రి— గురుఁడె దైవంబంచు గుణముతో నమ్మి
మఱువక సేవింపుమీ మానసమున।

చం— ప్రహ్లాదా, నీవిప్పుడు చదివిన పద్యార్థమేమో చెప్పుము.

ప్రి— గురువును దైవముగ నమ్మి సేవింపుము.

చం— చూచితివా! శాస్త్రములెల్ల ఘోషిల్లుచున్నవో? ఇంతటినుండి నీవు నీతి ననుసరించి గురువును సేవింపవలెను. మమ్మెదిరించి పలుకరాదు.

ప్రి— ఎందువలన?

చం— నేను నీగురుడనగుటవలన.

ప్రి— మీరొక విధమగు బోధకులగుదురు గాని గురువగుటెట్లు?

గీ. సత్యమేదో జగమున నసత్యమేదొ
వేలవేలుగా నెన్నఁగించి వేదఫణితి
నందు నిత్యాత్మపై మదిఁ బొందఁజేయు
గుణముఁ జూపిన వాఁడె పో గురుఁడు తనకు॥

చం—పిట్ట చిన్నది కూఁత ఘనమన్నట్లున్నదే! తిన్నగా చూచిన వ్రేలంత లేవు, నీకా నిత్యానిత్యముల తోఁ బనియేమి? ప్రహ్లాదా, ఇఁక నిట్టి యసంగప్రలాపముల చేసితివా మన్నింపను, తెలిసినదా? ఇఁక నిప్పటికిఁ బొండు. (అందఱు నిష్క్రమింతురు)

(ప్రహ్లాదుఁడు ప్రవేశించును. గురుగృహము.)

ప్ర—

చం॥ ప్రమదగుణనిధే, కలుషభంజన, శౌరి, హరీ, మురారి, యీ
శ్వర, కరుణామయాత్మ, నతసాధుజనోద్ధరణా, భజేభజే
చింతితపాపనాశన, పతితభక్తజనాంతరంగ, భా
సురచరితా, మహాద్రిగిరిగోషణా, భక్తజనౌఘపోషణా॥

పతితపావన, పరమాత్మ, నిరామయా, నిరాకార, నీ చరితంబులు మహాద్భుతంబులు. ఓ భక్తపరాధీన, సర్వేశ్వరుండవగు నీమహిమంబు తెలియంగ నాతరమా? (రాక్షసబాలురు ప్రవేశింతురు.)

గజ—ప్రహ్లాదకుమారా! నేఁడు మమ్మేలపిలువకుంటివి? నీవాగమృతధారల మావీనులు క్రొత్తచవులుం దని యున్నవి.

ప్ర—(నిమీలితలోచనుఁడై నిలిచియుండును.)

శామ్రి— ఈ ప్రహ్లాదబాలకునకింత నిరుపమవిజ్ఞాన బోధనం బెట్లలవడినదో? ఈతడుమాత్ర మందఱ వంటి బాలకుండును గాఁడు.

అజ—అగు, నది నిజమే. కాకున్న నిన్ని సుగుణంబు లొక్కనియందిమిడియుండు టెందైనం గంటిమా?

దీ—దీని కేమిగాని, ఈతఁడీశ్వరాయత్త చిత్తమున పరవశుండై యుండె. మనము పలుకరించుటెట్లు? నిన్న నుతకీర్తుఁడు గఱపిన పాటను పాడుచు భజనచేసిన నితఁడు మనతోడఁ గూడునేమో?

గజ—అగు, నది మంచియూహయే. (అందఱు నేకగ్రీవమునఁ బాడుదురు.)

పాట:— శరణుశరణు గరుడగమన- పరమపావనా।

పతితపావనా, మురారి,- భక్తపోషణా," శ।

ఇంతపంత మేటికి? శ్రీ- కాంతరాఁగదే?

దంతివరద మాయెడ దయ- దాల్పనౌఁగదే.॥ శ॥

ప్ర (తిరిగిచూచి చేతులుతట్టుచు కలిసి భజనచేయును)

కోపమా? మాపాపమా? యిటు- లో పరాత్పరా।

తాపసేంద్రప్రశస్త్యాలాప- దీప శ్రీపతీ॥ శ॥

వందనమిదె గైకొనఁగదె- యిందిరావరా।

వందితమునిబృందదేవ- మందరోద్ధరా॥ శ॥

(పాట చాలింతురు.)

గజ—రాకుమారా! నీ దివ్యబోధామృతమును చిలికి మావీనులకు విందొనర్పవా?

ప్ర—(నల్దెసలు నిటునటు చూచి) నేఁడు దుర్ముఖుఁడు రాలేదేమి?

దుష్ట—వానికి ధరించుటకొక్క వసనమేనియు లేక పట్టి జీర్ణాంబరములతో సిగ్గున రాకుండినాఁడు.

ప్ర—అరుణాక్షుఁడో?

అజ—పాపము, మూఁడుదినములై కటికిదరిద్రముచే కటికోపవాసములు చేయుచున్నవాఁడెట్లు రాఁగలఁడు?

ప్ర—అక్కటా! నాకీమూఁడుదినంబులై యీమాటయుదంతి మేల చెప్పరైతిరి? గజముఖా, నీవిప్పుడే పోయి మన దుర్ముఖునకిదియొసంగి వానినిటకుఁ దోడ్కొనిరమ్ము. (పైనున్న యుత్తరీయము నొసఁగి బంపును)

గజ—(తనలో) ఆహా! దుర్ముఖుఁడెట్టి భాగ్యవంతుఁ డిట్టి మన్ననలను దాల్చుచుండెను. ఈరాజనందనుని దెట్టి సరళహృదయము! (పోవును)

ప్ర—అజముఖా! నీవీవజ్రపుటుంగరమును విక్రయించి యరుణాక్షునకాహారమిడి వాని నిటకుఁ దోడ్కొనిరమ్ము? (పోవును)

(అజ- గజ- దుర్ముఖ- అరుణాక్షులు ప్రవేశింతురు.)

దు—(ప్రహ్లాదునికి మ్రొక్కి) నాచిన్ని జేడా! నేఁడు నామానమును గాపాడి రక్షించితివి.

ప్ర—(ఆతనిచేతులనుబట్టి లేవఁదీయును.)

అ—రాజపుత్రా? అన్నదానమొసంగి నాప్రాణము లు నిలువఁబెట్టితివి. (అంజలియొగ్గును)

ప్ర—(ఆతనిచేతులం బట్టుకొని) అన్నా, యిటురమ్ము. సంతుష్టిగాఁ గుడిచివచ్చితివా?

అ—దయానిధీ! నీదయవలన సంతుష్టిగాఁ గుడిచివచ్చి తి. నీకృపావిశేషంబెన్నఁటికేని మఱతునా?

ప్ర—నెచ్చెలీ! విధాయకకృత్యమునకింత వినుతింపనే ల? ఏకోదరులమగు మనయందొకరియభిమాన మొకరిదిగాదా?

దు—చిన్నిప్రభువా! అట్లనియెనవేల? అఖిలలోకేశ్వ రుని యబ్బురపుతనయుండవగు నీవెడ? బిచ్చపురక్క సిబిడ్డలమగు మేమెడ? మనకేకోదరన్యాయ మెల్ల లవడు?

ప్ర— దుర్ముఖా! అనంతకోటిబ్రహ్మాండనాయకుండ గు సర్వాత్మునకల్పాధిక్యత లెక్కడవి? ఆలోక పితానిశసంజాతులమగు మనమేకోదరులముగా మా? భక్తపరాధీనుండగు పరమాత్మునకు భాగ్య భోగ్యంబులతో పనియేమి?

ద—విగర్వచూడామణీ! నీనీతివాక్యంబుల యీ యు ల్లంబులెల్ల కృత్యంబుల నేమఱుపాటందుచున్నవి. మాజన్మసాఫల్యంబగుసత్పథం బెఱింగింపవా?

ప్ర—నెయ్యురారా! మాయను స్వాధీనపఱచుకొనిన చో నిత్యసౌఖ్యంబందఁగందురు.

గజ—రాతనూజ, మాయ యన నేది?

ప్ర—మాయ యన సారెసారెకు మాఱుచుండునది.

అజ—దానివలనఁ గలుగునదేది, దాని స్వభావ మెద్ది?

ప్ర—చంచలమగు దానిపై నిశ్చలమైనదను భ్రాంతి నిలుపుట దానిస్వభావము. దానఁ గలుగునదొక్క దుఃఖమే. ఎల్లప్పుడు నున్న స్థితి మాఱి వేఱొకరీతిని గన్పించుచుండును.

లఘు—అనఁగ?

ప్ర—పుట్టుట, పెరుగుట, నాశనమునందుట, తిరిగి పుట్టుట, యిదియే. బాల్యము, యౌవనము, జర, మృతి యన నీదేహమునకు మార్పులు గలిగించు చుండునదిదియే. కాన నీదేహాభిమానము విడువ వలయును. లేకున్న దుఃఖభాజనులమగుదుము.

అజ—దేహాభిమానమేల విడువవలయును? దేహము నందభిమాన మున్నంతమాత్రమున దుఃఖమేల కలుగును?

ప్ర—ఏలయన, దేహము దానిస్వభావమునుబట్టి, బాల్యము కౌమారము యౌవనము జర మృతిని గాంచును. మన మెంతజాగ్రత్తగఁ గాపాడినను నది కొంతకాలమునకు గతించును. శాశ్వతముగనుండవలెనని మనము దానియందభిమానమున నను కొందుమేగాని యది యట్లుండఁగలదా? ఉండునను కొనినది పోయిన మనకు దుఃఖకరముగదా! గాన దేహాభిమానంబు విడువవలయు. (చండామార్కులు ప్రవేశించును.)

చం—ప్రహ్లాదకుమారా! నీవిద్యాపరీక్షకై చక్రవర్తి నిన్నుంగొని రమ్మని వర్తమానమంపెఁ గాన మనమేగి వత్తము రమ్ము. (బాలకులంగని) మీరంతవఱకిట భద్రముగఁ బాఠముల వల్లింపుచుండుఁడు.

బా—(ఏకగ్రీవముగ) అయ్యా, మాకేల నీపాఠముల గోలయేల? మాకిటనుండి యీరాజపుత్త్రుఁడే గురుఁడును దైవంబును.

చం—(దిగ్భ్రమమునంజూచిఁ బాలుర శిక్షింపఁబోవ, తిరుగాడిపోదురు.)

ప్రహ్లాద చండామార్కులు నిష్క్రమింతురు.

3. అంకము. 4. రంగము.

హిరణ్యకశిపుని మందిరము.

విప్రచిత్తి హిరణ్యకశిపు లాస్థానమున నుండఁగా,
ప్రహ్లాద చండామార్కులు ప్రవేశింతురు.

హి—(ప్రహ్లాదునందుకొని యొడిలోనిడి చుంచుదువ్వుచు గురుపుత్రులంగని) భూసురాగ్రణీ! చిరంజీవి నీకడ నుత్సాహభక్తులం జదివించెనా, నీబోధనం బాలించి పఠియించెనా, అపాడు హరికీర్తనంబు విడిచెనా, రాజనీతి గ్రహించెనా?

చం—(తనలో) ఏమందును? ఈ బాలుని మూర్ఖత వెలిఁబుచ్చిన నేమో? ఈతని చిత్తమెట్లుండునో? పుత్రమోహమున నన్నే నిందించునేమో? కానిమ్ము, కొంతవఱకు యత్నించి చూచెద. పెండ్లిచూపుల నాఁడే ముండభరణపు మాటలేల? ఈతఁడేదారికి వచ్చునో చూచియే చెప్పవచ్చును. (ప్రహ్లాదుం గని) రాకుమారా! నీనేర్చిన యర్థమేదేని మీ తండ్రిగారి యెదురఁ దెలియఁబల్కుమా.

ప్ర—ద్వి॥ గురుఁడె దైవంబంచు గుఱుతుగా నమ్మి।
మఱవక సేవించుమా నెమ్మనమున॥

చం—(తనలో భయోత్కంఠమున) మనమా! యింతవఱకు ఫోరఁడి బాగుగానే యున్నది.

హి—ఆహా! యేమి యీబోధనాచమత్కృతి! ముందు బాలురకు గురువుపై భక్తి గలుగుటయే సదసద్వివేకానుభవముంగుటకుందగిన సులభసాధనము. ఇది యెంతయు శ్లాఘనీయంబుగదా?

ప్ర—నాయనగారూ! బాలురకనేల? యెల్లరకును గురుసేవనంబు విధాయిక కృత్యంబుకాదా?

హి—(పక్కున నవ్వి) నాచిన్నికుఱ్ఱ, యెంతయమాయికుఁడవోయి? (శిరము నురమునంజేర్చి ముద్దిడుకొని) నీవే మాకు బోధింపఁదలఁచితివి గాన నింక నిన్నే గురుఁడవని సేవింపవలయునుగా?

చం—(చిఱ్ఱుమొగముతో చూచుచుండును )

ప్ర—నన్ను సేవింపుమనుట కాదు. సర్వభూతాంతర్యామియగు సర్వేశ్వరుండెల్లజీవులకును గురుండును దైవంబును గాఁడా?

చం—(ప్రహ్లాదుని గద్దించును.)

హి—ఛీ! ఛీ! సర్వేశ్వరుండన నేనేగాక వేఱొకఁడుండెనని నీకెవ్వరు చెప్పిరి? సకలలోకేశ్వరుండనగు నాయండవిడిచి నీనేకాంతతో నొరుల సేవించుచుంటివి?

ప్ర—నిరంతరానందదాయకంబగు నిత్యసౌఖ్యపదవికై?

హి—అదియూ నీకోరిక? నీకు సౌఖ్యమే కావలెనన్న నిప్పుడేది కొదువ? పుత్రా, నీయిచ్చవచ్చిన సకల పదార్థంబులు సమృద్ధిగ సలరాయుచుండ, నొరుల ప్రాపుగోర నీకేల? నీయభిమతంబెద్దియో యెఱిం గింపుము. ధనమో, చేలంబులో, రథగజతురగా దులో, రతనంబులో, కాక నీయభీష్టార్థమెద్దియో తెలియఁబలుకుము.

ప్ర—తనుసౌఖ్యావహంబులగు నిట్టి యల్పవిషయంబు లు నాకేల? జనకా, తనువొక క్షణభంగురము కా దా, అట్టి తనువును సుఖంపఁజేయుటే సౌఖ్యమా?

హి—(నవ్వుచు) హా! నా వెఱ్ఱికుమారా, తనువునకుఁ గాని సౌఖ్యంబు తనకేల? తనువుండి యనుభవింప కున్న నటుపై తలక్రిందో కాళ్లుమీఁదో యెవ్వ రెఱుఁగుదురు? దారసుతాదిప్రియజనంబులకన్న సంతోషదాయకులెవ్వరు? విషయసుఖంబులకన్న మిన్నయగు సౌఖ్యమున్నదే? అఖిలలోకేశ్వరుండ ననిపించుకొనుచు నసురానీకంబుచే నూడిగంబు లందుచుండుటకన్న నానందమెద్ది?

ప్ర—ఎట్టెట్టూ! జనకా! అఖిలేశ్వరుండవని యొరుల చేఁ గీర్తింపఁబడుటే నిత్యసౌఖ్యావహంబా, దార సుతాదులే నిత్యసౌఖ్యదాయకులా?

మ॥ ధనదారాత్మజపుత్రమిత్రతతి నిత్యంబా? జగంబెల్లఁ ద
న్నయంబుంబరమేశుఁ గాఁ గొలుచుచో నానందమా? మోహమే
ఘనమా? యీవిషయాభిలాషసుఖమా? కాయంబనాపాయమా?
జనకా, యెంతటికైన పరీక్ష్యము భవత్సద్వ్యక్తులెన్నన్ మదిన్॥

హి—(కనుబొమలు ముడివైచి ప్రహ్లాదు నొడినుండి క్రిందికిఁ ద్రోసి) ఏమి నీప్రలాపములు! గుడ్డువచ్చి పిల్లను వెక్కిరించెనన్నట్లీవే మమ్మధిక్షేపించుచుంటివిగా? అఖిలలోకమ్ములస్మదాజ్ఞానవర్తులై యుండ, నీవు నన్నెదురాడ వెఱవకుంటివిగా? ఓరీ! దురాత్మా!

మ॥ నరలోకంబడఁగించి, దేవతుల నానాదిక్కులం గెల్చి, యీ
శ్వర విద్రూలనముంబొనర్చి, యఖిలేశత్వంబు గైకొన్నన
న్బరమేశుండనరాదె? చూడుమిదె మద్బాహుప్రతాపోన్నతిన్
సురదిక్పాలకులెల్ల చేతులనొగిన్ జోడించి కీర్తింపరే?॥

ఇన్నిదినములనుండియు గురుపుత్రులు గఱపిన విద్య యిదియా? (గురువునుగనుచు.)

చం—(భయోద్రేకమున చేతులు నలుపుకొనుచు) రాక్షసేశ్వరా! ఇందావంతయేని మాతప్పులేదు. నాకఱపిన హితవాక్యంబులెల్ల భవత్సూనుండాలింపకుండుటయే కాని, యొక్కనాఁడేని విధివిషయంబుల విన నొల్లఁడాయె? ఓ దైతేయాన్వయపారావార

సుధాకర! నీయన్నోదకంబుల నాసించిన మేమేటి కి నీతనయునకిట్టి యహితంబులు నేయ్యుదుము? నామాటలాలించి యిప్పటికి శాంతింపుము. ఇటు పై నయభయోపాయంబుల నదలించియో బెద రించియో చక్కగా సకలార్థములనుబోధించి తె చ్చెద. ఈసారి మన్నింపుము.

హి—కానిమ్ము. అదియుంజూచెద.

(నిష్క్రమింతురు.)

3. అంకము. 5. రంగము.

గురుగృహము. ప్రహ్లాదుఁడు సహాధ్యాయులు ప్రవేశింతురు.

ప్ర—ఈసృష్టియందున్నవన్నియు సారెసారెకు మా యుచుండునుగాన వీని నన్నింటిని స్థిరమైనవని నమ్మ రాదు. వీనియందు తిప్రిమకు నాన చేయరాదు. అట్లలవాటుపడితిమా, మన యంతరంగశత్రులు ణఁగిపోదురు.

దు—అంతరంగశత్రులనవ్వారు?

ప్ర— కాముఁడు, క్రోధుఁడు మొదలగు వార్గురు గలరు.

అజ—వారందేమి చేయుచుందురు?

ప్ర—చోరత్వమునకై వేచియుందురు.

గజ—అందేమి హరింతురు?

వ్ర—జ్ఞానమును.

ద్వి—అజ్ఞానమువలన మనకేమి ప్రయోజనము?

వ్ర—మన యింద్రియములకు లోఁబడి యాటబొమ్మల వలె నాడుచున్న మనచిత్తమునకా యొత్తిడి తప్పించుటే.

అ—ఓహో! యీమాయకు మనలను వశమొనర్చు కూరులీచోరులా! అట్లయిన వారినిప్పుడే నాకరాసికి బలియిచ్చి వత్తును.

వ్ర—(నవ్వుచు) వారు కత్తులకుఁ జిక్కువారుకారు.

అంబ—మరి వారి జయించుటెట్లు?

వ్ర—సత్యమువలన, ప్రేమవలన, నిష్కామత్వము వలనఁ గాని, యిట్లు పటాటోపముగ బయలుదేరిన దొరుకువారుకారు. వారరూపులు.

దు—అరూపుల జయించుటెట్లు?

వ్ర—ఎట్లా? కామాదులన విఘ్నమొచ్చలకై మన చిత్తమును శోకింపచేయు వృత్తులు. వానిని మన మతి జాగ్రతగఁ గనిపెట్టియుండి దరిజేరనున్నప్పుడెల్లఁ దరిమి కొట్టుచుండవలెను. ధైర్యమును విడువక యుండవలెను. లేనిచో నెంతటివానినైన నవి పైఁ

బడి యవశేంద్రియునిజేసి పెక్కు చిక్కులం బెట్టుచుండును.

గజ—అట్లయిన వానినన్నింటి నొక్కసారిగా నణఁచి నిశ్చింతతో నుండరాదా?

ప్ర—అట్లగుట దుర్లభము.

అజ—మఱి యెట్లు? నీవినణఁచక తీఱదంటివి. అన్నింటి నొక్కసారిగా నణఁగుమన్న, నట్లణఁగవంటివి. ప్రతినిమేషమును గనిపెట్టి యణఁచుచుండవలె నంటివి ఏమైన వేఱె యోచన లేక యుండే బుద్ధి యనునిమేషమును బొందించి యుండఁగలరా?

ప్ర—అట్లు పొందింపవలవాటు పడవలెను. చూడుఁడి. అడవి మృగముల బాధనణఁచుట కని జనపాలుఁడు తగిన సన్నాహముతో వేటకై వెడలునుగదా? అతఁడు వెడలునపుడడవియందన్నింటిని వెదకి వెదకి, పట్టవలెనను నుత్సాహముననే పోటుబంట్లతో బయలుదేఱును గాని, యందు సగపాలేని నరపాలునకుఁ జిక్కునా? ఈపటాటోపమునుగాంచి మృగములన్నియు నెందెందో నక్కిపోవును. అట్లే ఈ కామాదులును శోధించిచూడ మనయందతి స్వల్పముగ నొక్కటియో రెండో యున్నట్లు దోఁచును గాని తక్కినవన్నియుఁ గానరావు.

అసు—అట్లు మనము కన్నెత్తి చూచిన నణఁగియుండు భీరువృత్తులెవ్వఁడు మాత్రము మనల నేమిచేయఁగలవు?

ప్ర—అట్లుగాదు ఆయుధహస్తునకు వెనుక తగ్గిన నెంత యల్పజంతువైనను నిరాయుధునకు వెనుక తగ్గునా? వేఁటకేగిన నెందును గానరాని వ్యాఘ్రాదులు యేమఱుపాటున నాదారినేగు ప్రయాణికులఁగని పైఁబడకుండునా? గుఱిచూచి యదరుపాటున వానిపైఁబడి యుఱఁచివేసినట్లే యివియు వాని యెడ నప్రమత్తులై యున్నచో సమయానుకూలముగ మనయందుఁ జొచ్చి చిక్కులపాలు చేయుచుందును.

గడ—ప్రహ్లాదకుమారా! నీదయవలన నిప్పుడు చక్కగా బోధపడినది. ఇంక విషయచింతనలకాలము వ్యర్థముచేయక నీవిప్పుడెఱింగించినమార్గము ననుసరింతుము. బాలకులారా! రండురండు? అయ్యవారి కింక సెలవిడివత్తము. మనకా గురుదండనయే తప్పినది. అన్నింట సీరాజపుత్రునిమార్గమే సంతతానందదాయకముగ నున్నది? మనకీతఁడే పరమగురువు. (అందఱును బోదురు.)



శ్రీ

# ప్రహ్లాదనాటకము.

## చతుర్థాంకము.

### 1 రంగము.

హిరణ్యకశిపుని మందిరము.

(హిర - మంత్రి - చం - ప్ర - ప్రవేశింతురు.)

హి—(గురుపుత్రునింగని) ఏమేమీ ప్రహ్లాదుఁడిట్లు తిరుగాడెనా? నీమాటల నొక్కింతయేని వినకుండె నా? నామహాత్మ్యమెఱింగించిన నట్లు తిరస్కరించెనా?

గు—దానవాగ్రణీ! యేమని మనవిసేయుదు? తాఁజెడ్డ కోఁతి వనమెల్ల చెఱచెనన్నట్లు తాను వినకుండుట యెగాక తోడిబాలురనెల్ల తనమార్గమునకీడ్చినాఁడు. బహుజన్మాంతరభవతాపనిర్మూలనంబునకై సర్వజీవులు మోక్షాసక్తులగుట మేలనియు, మోక్షేచ్ఛగల వారామోక్షప్రదాతయగు హరిని భక్తిభావంబున భజింపవలయుననియు నింక నేమేమొ గాటంపుబూటకంబుల జెప్ప, నాబాలురెల్ల నేను గఱపెడి శాస్త్రంబు లొల్లమని తిరుగాడిపోయిరి. దేవా,

ఉ॥ చెప్పినవానిలో నొకటి చెప్పక, నీయెడ టన్ విరోధివై
నిప్పగిదిన్ బహుస్తుతుల నేకరువెట్టెడు నీకుమారుఁ; డీ
చెప్పిన వెల్ల మేమిటులు చెప్పితిమంచుఁ దలంచెదీవు; మా
తప్పులుగావు దుష్టగ్రహతారకదోషముఁగాని భూవరా॥

హి—(తల పంకింపుచు) ప్రహ్లాదా! నీవింక నీధోరణి విడువవుగా? నీకింక నాహరిపిశాచము వదలకుండెఁగా? ఓరీ మూర్ఖా! అట్టితులువ, ఆపాఱుబోతు, నీ పిన్నతండ్రి నకారణమునఁ గూల్చిన పాపాత్ముఁడని నీకెన్నిసారులు దెల్పవలయునురా?

ప్ర—తండ్రీ! తానొనర్చిన కర్మంబె గాక తన్నుఁ గూల్చువా రెవ్వరు? సర్వసముండగు సర్వేశ్వరునకు శత్రుమిత్రభేదమనఁగలదా? ఇట్టి వైరప్రయోషణంబు మనస్సంభవంబుగాదా?

కం॥ తనలోని వైరిషట్కమె
తనకెల్లెడ నించు శత్రుతగ జగమునఁ; నా
ఘనవైరులణఁగ నెల్లరు
తనమిత్రులుగారె, వైరితతి యనఁగలదే॥

హి—(కన్నులెఱ్ఱచేయుచు) ఓరీ దురాత్మా! నీవాగ్జాలంబున నా కెట్టివెక్కసి బాలకులవలెంబడి చెముడు ననుకొంటివా చెంటీ? ఎన్నివిధములఁదెల్పిన నీకీ హితవాక్యములు రుచింపకున్న వేమిరా? తగిన దం

డనమ్మనంగాని చక్కఁబడవా? (మరల జాలితో) ఇసీ వెఱ్ఱికుఱ్ఱా! నిష్కారణంబ మత్కోపానలశలభంబవై యేల చెడెదవు? నామాట వినుము. ఆహానువిష్ణువును కలనైనఁ దలఁపఁబోక ఈనిఖిల సౌఖ్యాంబుధివీచికల నోలలాడుము. ఏల యిట్టి విచ్చిభ్రాంతిచెందెదవు? నిక్కముగ నాహరి యొందను లేనే లేఁడు. లేకున్న నేనామానహీనునికొఱకెల్లలోకమ్ములట్టిట్టు చేయుచుంటినే, ఎందైననున్న నాయెమర నేలపడఁడు? ఆపరమనీచుఁడు తన భక్తులంబట్టి నేబాధించువేళనైన నేలరాఁడు?

సీ॥ ఏపిట డాగినాఁడా విష్ణుహతకుఁడు
త్రిదశులఁబట్టి బాధించువేళ।
నేమూలడాగినాఁడా మానహీనుండు
దేవతాంగనల బంధించువేళ।
నేగుహాలముజొచ్చె నా గుణహీనుండు
మునిజనంబును బడ మోదువేళ।
నేకొండకగఁబ్రాఁకె నా కుటిలాత్ముండు
గోసహస్రముల నేఁ గూల్చువేళ।
గీ॥ సెందుగూలెను నాఁడు నే నెల్లవేద
శాస్త్రములఁ గాల్చువేళ, తాఁ జచ్చినాఁడొ,
జ్ఞానహీనుఁడొ, భక్తులఁ గావలేఁడొ,
మానమున బెట్టిదో తనమది నెఱుఁగఁడొ?॥

కాన నామాట నమ్ముమా, హరి ఎందును లేఁడు, లేఁడు, లేఁడు, ముమ్మాటికిని లేఁడు.

ప్ర—(నవ్వుచు) ప్రియజనకా! నీవాక్యంబు లాశ్చర్యదాయకంబులుగదా! జగదీశ్వరుండగు హరియే లేకయున్న జగంబులుమాత్రముండునా?

కం॥ జగములకు నాదిబీజము,
నిగమాంతవిలోలుఁ, డఖిలనిత్యాత్మకుఁడౌ,
జగదీశుఁడె లేకుండిన
జగములు లేకుండుఁగావె సర్వజ్ఞనిధీ॥

హి—(పండ్లు పటపటఁ గొఱుకుచు) ఏమి నీకండకొవ్వు? ఎవడురా అక్కడ?

(కింకరులిరువురు ప్రవేశించి) దేవా!

హి— కింకరులారా! మీరీకుటిలాత్ముఁ దోడుకొని వింధ్యభూమికింజని,

మ॥ ఒకమాఱూపిరివోవనీయక దినమ్ముల్ క్రొక్కొక్కలీశేగ్వడన్
సకలాంగమ్ములఁ జీల్చి, యంతకును లేశంజేని లాభంబులే
క కడున్ మూర్ఛితనూపెనా, కరులచే కాలాగ్రశ్రేణిచేఁ
బ్రికటోద్ధూతశిఖాళిచే శిలలచేఁ బ్రాణంబులన్ దీయుఁడీ॥

(ప్రహ్లాదుని భటులీడ్చుకొనిపోదురు. అవనిక జాఱును.)

4 అంకము. 2 రంగము.

(లీలావతీ మందిరము, లీలావతి శోకసంతప్తచిత్తయై పడియుండును. హిరణ్యకశిపుఁడు ప్రవేశించును.)

లీ—హా! ప్రహ్లాదా! ఎన్నివిధములబోధించిన హరిభక్తి వీడనైతివిగదా తండ్రీ? నిన్నాకటకటా రక్కసులెట్టి కష్టములం బెట్టుచుండిరో? అయ్యో! నీవా కఠినశిక్షల భరింపనోపక మరణింపలేదుగద?

(రాక్షసభటులు ప్రవేశింతురు.)

భ—సామీ! తమ యాజ్ఞానుసారంబుగఁ గుమారుం గొనిపోయి మేమాకటికభూమి నన్నపానీయంబుల నెఱుఁగకుండ కటకటకత్తుల నోడలెల్ల నఱికి విడచితిమి.

హి—(చెవులు మూసికొనిసి) కట్టా! కుమారా! ఎట్టి శిక్షలపాలైతివి?

భ—దేవా! ఎంతటికిఁ దనపంతంబు వీడఁడయ్యె. తుదకు మాప్రాణంబులు విసిగి కశాభిఘాతంబుల మోదినంతన

హి—(ఆత్రముతో) ఏమీ! విష్ణుభక్తి విడచెనా?

భ—సామీ! లేదులేదు. ఇదె యాబాలకిం పుఁడు. అతఁడొక్క మందహాసమొనర్చె; అంత మేమొక్క ఘో

రనాగంబును బట్టి తెచ్చి తొడలెల్ల వట్టిచిల్లులు
గఁ గఱపింపవలెనని మీఁద విసరినతోడనే,

హి— (అదరిపడి) అహా! తోడనే కుమారుం
డుసురులుపాసెనాయేమి?

లీ— హా! కుమారా! (మూర్ఛిల్లును.)

భ— లేదు లేదు దేవా! ఆనాగరాజంబే ప్రాణవాయు
వుల వీడినది.

హి— (దిశలు తిలకింపుచు) ఆ! ఇదేమివింత? కింకరు
లారా! అంతటికైన నాకుమారుండు హరిభజనం
బు విడిచెనా?

భ— స్వామీ! ఎంతటిశిక్షలనైన భరింపఁగలఁడఁట! శ్రీ
కాంతుని భజనంబుమాత్రము వీడనేరఁడఁట!

హి— ఆ! ఏమీ! అంతటికిని తనపంతము వీడకుండెనా?
కానిండు. కింకరులారా! మీరీపాపాత్ముం బట్టి ప్రళ
యాంబుధివీచికలఁ గూలఁద్రోసిరండు; శీఘ్రింబ
పొండు (పరిస్లానవాటితో భటులు నిష్క్రమింతురు.)

లీ— (మూర్ఛనుండి లేచి) హా! కుమారా!

సీ|| కఱకుఱక్రూరములు నిగ్గట్టిగా కట్టిడివేళఁ
దనువునొవ్వఁగ నెట్లు తాళినావో।
చుఱుకుచుఱుక్రుంచు కూలాగ్రములు మేన
నంటినఁ నెబ్భంగి నాఁగినావో।

తలిదండ్రులెంత నిర్దయఁ బూనినారంచు
నేరీతి మమ్మెంత దూరినావో।
అన్నపానములు లేకున్న నాకటనుద్రిక్కె
వేఁడికన్నీరెంత విడిచినావో।

గీ॥ నన్నుఁ గన్నయ్య, నాదు చిన్నారిపట్టి,
భీకరాహినిగని యెంత భీతిలితివో?।
జనకుతో వైరమూన దుస్తరమటంచుఁ
దొలుత నేనెంతఁ దెలిపినం దెలియవైతి॥

ప్రాణేశ్వరా! చక్కఁగా యోచించిచూడుము. జ్ఞానవంతులగు కొందఱుబాలురే చిఱుతప్రాయంబున నైజప్రవృత్తిని మరల్పుదురు గాని అందఱునట్లు మరల్పుట స్వాభావికంబా? నాథా! పసివానితో నింత వాదా?

(తెరలో రాక్షసభటులు)

రండురండు. బాలకుండీమహోదధింగూలి మునఁగించినట్లేయున్నవాఁడు? ఇంకను శంకింపనేల? అదుగో! ఆవైపున కొట్టుకొనిపోవుచున్నాఁడు. నడువుఁడు. ఇంక నాతఁడు మనకగోచరుండై పోయె.

శా॥ బాలుండబ్ధిమునింగి కొట్టుకొని పోవంబోవఁగా, నల్లక
ల్లోలాంభోనిధిలోన మీన నుసురుల్ గోల్పోవఁడే? యింక మీ
కేలా సందియమంద? రండు, మనరాజేంద్రుంగనన్ బోద; మీ
జాలంబేల? సురారమోళిఁదగునీ సర్వంబెఱింగింపఁగన్॥

లీ—హా! నాముద్దుపట్టి! నన్ను విడిచిపోతివా? నాథా! ఇంక నేనేమిచేయుదు? అయ్యో! నామురిపెంపునందనుఁడు నేఁటితోఁ గూలిపోయెనే? ఇట్టి ఘోరవార్త వినియు నీమనంబూరటఁజెందియున్నదా? ప్రియమును నమోఘపదార్థంబు నీమనోవీథినుండి తొలఁగిపోయినదా? పసిపాపనిపై నింత జాలిలేదా? హా! ప్రహ్లాదా! ప్రహ్లాదా!

ప్ర—తల్లీ! నమస్కారము.

(భటులు ప్రవేశించి ఆశ్చర్యముగాఁ జూతురు)

లీ—(ప్రహ్లాదు నక్కునంజేర్చి శిరంబుమూర్కొనును.)

ప్ర—(చేతులమోడ్చి)

కం॥ పాహి దయాంభోనిధి, మాం
పాహి హరీ, పరమపురుష, పాహిమురారీ!
పాహి భవభయవిదారీ,
పాహి సుభక్తానుమోదపదయుగ, శౌరీ॥

హి—(జాలిగొలుపుచూపులతోఁ ప్రహ్లాదుని జేరఁదీసి చుంబకముంబట్టి) కుమారా! నామాటలించుక వినవా? నాతోఁడ వైరమూనఁదలంచితివా? ప్రాణములయెడఁగూడ నాసవిడిచితివా? అయ్యో! చిన్నికన్నా! యేనలిగిన నెల్లలోకమ్ములొక్కసారి భస్మీభూతంబులగునే! నీవననెంత?

గీ|| కన్నకడుపాట, మోహంబు కానిదోటఁ
గాచితినినమ్మి యిన్నాళ్లు కన్నతండ్రి,|
కానిమాఱఁడె ముందునకైననంచు
నీయుపలఁగలలోపాగ్ని నెగయనీక||

కాదేని, అస్మదీయక్రోధానలజ్వాలల నెల్లలోకమ్ములొక్కసారి భస్మీభూతంబులు గాకుండునే? కుమారా! ఇఁకనైన నాహితంబొక్కింత యాలింపుము.

ప్ర—జనకా! సావధానుండనై యుంటి.

హి— గీ|| విడువుమీ తండ్రి యీపాడు విష్ణుభక్తి;
గట్టిగా మీ గురుహితేచ్ఛావికాసమునను;
యడఁచుమీ హరిపై చిత్త మనవరతము,
చెడకుమీ కుఱ్ఱ యీశౌరి సేవఁగోరి||

ప్ర— గీ|| విడువఁజాలను సుమీ తండ్రి విష్ణుభక్తి;
నిలుపఁగాఁజాల నైహికనియమములను;
దలఁపఁగాఁజాలఁ బ్రకృతి బంధములనెన్నఁగ;
జేరఁగాఁజాల హరిభక్తి దూరమతుల||

హి—(క్రూరదృష్టితో) ఏమేమీ! నీవా హరిసేవ వీడ నేరవుగా?

ప్ర— జనకా! ఏనేమి సేయుదు? ఏరీతి హరిసేవ పాయుదు?

ఉ|| ఏగతిఁ జేసి శాస్త్రములనెల్లను శోధనఁ జేసిచూచినన్
త్యాగము రాగముల్ వ్యథయుఁ దాపముఁ గోపము నాదిగా మనో

వేగములన్ హరించి, చెడువృత్తులలోనఁ దొలంగఁజేసి, స
ర్వాగమవేద్యుఁడైన హరియందు మనంబును జేర్పఁగానగున్॥

కాన ననాత్మయందంతరంగ మెంతటికిఁ దగులదయ్యె.

హి—(తీవ్రదృష్టితో) అరే మూఢా! నోరుమూయుము. నీవింక నాహరిని దలపెట్టితివా, నిన్ను కరవాలమున కెరఁజేసెద, చూడుము? (కత్తి దూయును)

లీ—(అడ్డమై) ఇంతటికైన ప్రాణములతో బ్రతుకఁ గోరుము. నా చిన్నియన్నా,

గీ. పంతమూనకు, శ్రీకాంతు భక్తి విడుమ,
సంతతము జనకునిఁజేరి శరణమనుము।
వినుము నామాటలొక్కింత మనమునందుఁ,
దూలనాశకు నిన్ బతిమాలుకుందు॥

ప్ర—తల్లీ! యేల పలుమాటలు? ఆపరమపురుషుని భజనంబు వీడి బ్రతుకఁజాల.

హి—ఖలమతీ! (కత్తితో వేయఁబోవును. లీలావతి ప్రహ్లాదుని లోనికిఁ గొనిపోవ హిరణ్యకశిపుఁడు వెంట కోపమునఁ బోవును)

(తిరిగి హి- లీ- ప్ర- ప్రవేశింతురు.)

ప్ర—అమ్మా! హరిభజనంబువీడి యస్థిరంబులయి తనుసౌఖ్యాకరంబులగు భాగ్యభోగ్యంబులాసించుటేల? చూచితే,

గీ॥ తనువుమిథ్య, యైహికభోగతతులుగల్ల,
సారహీనము లఖిలార్థసంచయములు।
గాలిలోపలి కర్పూరమాలిక యన
భాగ్యభోగంబులెల్లక్షణభంగురములు॥

హి—ఏమేమీ! మరల నీమెట్టవేదాంతమున వెదఁజల్లుచుంటివిగా కుమతీ? తనువస్థిరంబై ప్రపంచమే మిథ్యయైనచో నిఁక సత్యమైన దెద్ది? నిత్యమైన దెద్ది?

ప్ర—తండ్రీ!

గీ॥ సత్యమొకఁడె పరమార్థానుసారఘటితి,
నిత్యమొకఁడె సచ్చిదానందనియతభక్తి।
సారమొకఁడె యీశ్వరార్పణాచారసరణి,
సౌఖ్యమొకఁడె శౌరిపదయుగసంస్తవంబె॥

హి—ఒరీ! నిర్భాగ్యుఁడా? సంతతానందదాయకంబగు సంసార మసత్యమనియు, నెందును గని విని యెఱుఁగని మోక్షమే నిత్యమనియు, నిట్టి వట్టి బూటకమ్ములచే మమ్ము వంచింపఁదలఁచితివా? కానిమ్ము. నిన్నును నీహరిభక్తినిం గూడ నిర్మూలనంబొనర్తును. ఓరీ కింకరులారా!

(రాక్షసభటులు ప్రవేశింతురు.)

హి— అనుచరులారా! మీరీకులద్రోహినిం గొనిచని,

కం॥ బాలుండీతఁడు శిక్షల
తాళఁగఁజాలండటంచుఁ దలఁపక మీరీ
బాలుని దుశ్శీలున్ భువిఁ
మూలందగుసాధనములతోఁ బొరిగొనుఁడీ॥

కం॥ అక్కటకట యోచింపక
కట్టా! సుకుమార దివ్య గాత్రుఁడనక రా
పట్టిగ బాయని వెలవక
పట్టిగిరులచరియలందుఁ బడఁద్రోయుఁడిఁకన్॥

(ప్రహ్లాదుని ముందుకుఁద్రోయును. లీలావతి అడ్డమై)

లీ—నాథా! నా దెస నించుక కటాక్షమాలికలఁ జిమ్మి ఈపసివాని నిప్పటికీదండనలనుండి విముక్తునిగావింపుఁడు. ఇట్టి లేఁబ్రాయపుకోమలాంగకములట్టి కఠినశిక్షలపాలుగావింపఁదగదు

హి—నన్నింక వారింపకుము. వీఁడింక చక్కఁబడుట కల్ల. లీలావతీ! మనకీపుత్త్రుండు శత్రుండనియే నమ్ముము.

కం॥ తలిదండ్రులకామోదము
గలిగించుచు సతము గొల్వఁగాఁదగుసుతుఁడే
యిలసూతుఁడనఁదగుఁ గాక వి
కలమతియై వెతలనించు ఖలుఁడొకసుతుఁడే?॥

లీ—(కన్నీరు దుడుచుకొనుచు ప్రహ్లాదునితో) తనయా! నీకిట్టియాపదలవిధాత లిఖించె, నేనేమిసేయుదు? ఎంతవలదన్న నీవా శ్రీకాంతుని విడువకుంటి

వి. నీయెడ నీజనకునిచిత్తము వజ్రనిభమై కరఁగకున్నది. తండ్రీ! నీకోమలదేహంబట్టి కొండచరియలంబడి పిండిగా నలుగనుండెనన నేనెట్లు భరింపఁగలను? నీతండ్రిచిత్తమెట్లు మరలింపఁగలను? అయ్యో! దనుజేంద్రుఁడెట్టి కాఠిన్యమునకై దలఁపూనియున్నవాఁడు. ఆమహానీయుని యంతరంగమున నక్కటికమన్నది దోఁపకున్నదిగాఁబోలును?

ప్ర—అమ్మా! పుత్రవ్యామోహమునఁ బూజ్యచరితులగు మాతండ్రిగారి నేల నిందించెదవు?

మ॥ ననుశిక్షించెనటంచు నెంచి మదిఁగిన్కన్ బూజ్యులైనట్టి మ
జ్జనకున్ దూరకుమమ్మ, నీచరణకంజాతమ్ములన్ వ్రాలెదన్;
వనజాతేక్షణు భక్తిపీడుమని నన్ వారింపఁబోకమ్మ, నా
కనయంబాతఁడె తోడునీడ, విడలేనమ్మ తదీయాంఘ్రులన్॥

లీ—(నిరుత్తరయై యూరకుండును.)

హి—(పండ్లు పటపటఁగొఱుకుచు) పీఁడింక నుగ్రదండనలఁగాని చక్కపడఁడు.

గీ॥ తల్లిదండ్రుల చిత్తవేదనలనించు
తనయుఁడే శిక్షలకునైనఁ దగును సుమ్ము।
కులమునకు వన్నెనిడువాఁడె కొడుకుగాక
కొడుకులే యిట్టి పట్టిదుండుడుకులెల్ల।

లీ—(ఉస్సురని నిట్టూర్పువిడిచి) హా! వల్లభా! యెట్టిచెడుగైన నింతలేఁబ్రాయమున నే ఇట్లు దండింపఁదగునా? (పాదములఁబడఁబోవును.)

హి—(కోపముతో) లీలావతీ, నీవిటనుండిపొమ్ము.

లీ—అయ్యో! నేనీదుర్భరశోకాంబుని నెట్లు భరింతు? ప్రహ్లాదా! నీవైన నీహరిసేవ వీడవా?

ప్ర—తల్లీ! దేహాభిమానమునఁజిక్కి పరమేశ్వరుని సేవ విడువఁదగునా?

లీ—కుమారా! ఇది నాపూర్వకృతదురితఫలంబెగాక యెఱిఁగియెఱిఁగి యొరుల నిందింపనేల?

సీ॥ అనుజునిజంపెనంచాశౌరిపైని నీ
జనకుండు కనలుచు జంపనుండె।
వీడుమంచెంతనిన్వేడిన హరిభక్తి
వీడి నీజనకుని గూడవీవు।
సురలఁబెంపను దైత్యవరులఁజంపను రమా
వల్లభుండొక దీక్ష పట్టెనంట।
పతిసుతులాట మీపైనున్న మోహంబు
నామదివీడదే నాఁటికైన।

గీ॥ నేమి చేయుదు, వల్లభునేమనందు,
నీమనంబెట్లు మరలించు నేర్పుగందు।
దైవఘటనంబు నేనెటుఁ దప్పిమంతు,
నెందు నామదికుపశాంతి కేదిమందు?॥

తనయా! నీవనకు నీకన్న మిన్నయగు దైవంబు మ
నకెందుఁగలఁడు? నీవింకనైన నాయనను శరణు వొ
చ్చి బ్రతుకుము.

ప్ర—ఇట్టి యవస్థాభేదముల కారాటమందుచు వెఱ్ఱి
గాదే మాతా? నీవేల మజ్జనకునకు సదుపదేశంబు
గావింప మఱచియుంటివి? అతని హృదయతాపోప
శమనంబొనరింపఁదగు మధువైరి మధురనామకీర్తనం
బేలగావింపకుంటివి? ఆమహానీయుని చిత్తశాంతికిం
దగు కైరవ్యూహింప జాగేలచేయుచుంటివి? తల్లీ!
నీవల్లభుని యుల్లమావైకుంఠుని పదపల్లవంబులం
జేర్పుమా.

హి—(కత్తిని ఝుళిపించుచు) ఓరీ! దుర్మదాంధా! ఏ
మని పేలుచుంటివి? అపరమసీచుండగు పరిపంథిని
గొలువమనుచుంటివా, యేమి నీసాహసము? ఆప
లుకకే యెందును లేనేలేఁడని తెలుపలేదా?

ప్ర—తండ్రీ!

ఉ॥ సందియమందకయ్య, పలుసారులు మాధవుమాటిమాటి బల్
నిందనుపొందకయ్య, భవనీరధిఁగూలఁదలఁపకయ్య, గో
విందునిజేరి సంసరణపీచికలం దరయింపుమయ్య, యా
నందసుఖాంబుధిన్ మునుమునందఁగఁ గోరఁగదయ్య, వేఁడెదన్॥

హి—(పండ్లు పటపటఁగొఱుకుచు ప్రహ్లాదునిపై కత్తి
కఁబోవును.)

లీ—నాథా,

సీ॥ ఉన్నతనంబంచు శిక్షించవలదంచు
నలనాఁడు గురునితోఁ బలుకలేదె।
శిరము మూర్కొని, "తండ్రి, చిరజీవి", మ్మంచు
ముంచుసుదుష్టి దీవించలేదె।
కన్నుఁజేసి నే గద్దించుచో వల
దంచు నడ్డమీకె వారించలేదె।
గురుగృహంబున నెంత వెతపడుచుండెనో
యనుచు గుసుగుసంచు నడలలేదె?।
గీ॥ ఇట్టివిడరాని ప్రేమ యేమాయెనకట?
పట్టినీకిటుల బలుపాట్ల పాలుచేయఁ
గ్రూరదనుజాసిధారల గుతికెక్కఁద్రోయ
తాళగలఁడో కొడుకీ యీయుగ్రదండనలకు?॥

హి—ఇట్టి కులద్రోహిని కరుణింపవలయునా? ఇట్టిఖలు నగ్నికుండంబుల కంటఁగట్టిన, నసిఘాతమ్ములఁ జెక్కి విడచిన, దోసమున్నదా? ఓరీ కింకరులారా, (భటులు ప్రవేశింతురు.) ఓరీ! వీనిం గొనిపోయి వివిధమార్గోపాయమ్ముల మీ యిచ్ఛవచ్చినరీతి వేధించి వీనియసువుల కానుక గొనుఁడు? శీఘ్రింబ పొండు, కార్యాతురులు గండు.

(భటులు ప్రహ్లాదునితోఁ బోదురు.)

లీ—(దగ్గుత్తికతో చేతులను మోడ్చి)

మానుషపగు నెదఁ గానుమా - పూనికతో సేవింపుమా।
గానలోలుని - దీనపాలుని - లోనెఁదగన్ పూజింపుమా।
మనమా, - యనువగు - నను మానుమమన॥ గా॥

ధ — హా! క్రొయ్యపాపఁడా! నీకో అమాలిన మొండితనముచే మా ప్రాణములు విసిగిపోవుచున్నవి. అదెట్టిబుత్తియో కాని నీకాకలిదప్పులుగూడ నంతరించినవి. మాకుఁగూడ నాయాశలన్నియు నెల్లడఁగును? ఎన్ని దినములని యీవల్లకాటికంబడి నిద్రాహారమ్ములకు దూరులమై యెండవానలకోర్చియుండఁగలము? నీయసువులెన్నఁటికిఁ బాయకున్నవి! నీపై విపరుచున్న కలశకత్తులన్నియు విఱిగిపోవుచున్నవి. నీశక్తి యెట్టిదియో కాని ఏనాఁటికిని సన్నగిల్లదాయె! నిన్ను ముట్టినంతనే యంత పెద్దపాము మొద్దువలె కట్టుగట్టి పోయినది! నీకెట్టినుంచుమాకులు దెలియుతో తెలియకున్నది. అబ్బబ్బా! మా పెదవులాఱుచున్నవి. ప్రాణములు కడఁబట్టుచున్నవి. పద, నిన్నిసారి కడతేర్చితిరెదము. (లాగుదురు.)

వ్రి—

ఉ॥ కన్నులముందు వెన్నెలలుగాచెడి నవ్వుమొగంబు, నీలపున్
వన్నెల మించు మేను, మనఃఫాలము, జెక్కులు, దీర్ఘబాహు, ల
త్యున్నతవక్షమున్, ప్రకటితోరుకటాక్షవిశాలవీక్షలున్
చెన్నలరార నాయెదుట చేష్టలుసల్పెదిదేమిచోద్యమో!॥

(చేతులను మోడ్చి యూర్ధ్వలోచనుఁడై) ఓ భక్తపరాధీన, భక్తజనశరణ్యా, ఇప్పటికిఁగదా నీవు నన్ను విముపక వెన్నంటి తిరుగుభాగ్యంబు నందఁగంటి, ఆహా! నీకోమలాకారం బెంతచూచినను దనివితీర కున్నది. దేవా! ఇంక నీదివ్యరూపంబు నాకన్నులకు మఱుఁగు పెట్టక స్థిరముగఁబొనగూర్పుమా, పక్షివాహన! (భటులీడ్చుకొనిపోవుదురు.)

4 అంకము 3 రంగము.

హిరణ్యకశిపుని రహస్యమందిరము.

(హిరణ్యకశిపుఁడు ప్రవేశించును.)

హి—(తనలో) ఇంక నెంతనిధైర్యమూనియుందు, నిదేమిచోద్యము? నిజముగ విష్ణువిట్టి పురుషసింహమై యుండునా? సారెసారెకు నన్నదిరించి బెదిరించు చుండుటయే సత్యమా? స్వప్నభ్రాంతియేమో? కాదుకాదు. కలయెట్లగును? నాకన్నులు తెఱచియే తిరుగాడుచుందునే! అట్లెట్లెంతు? ఏమో, యేమనుటకును దోఁచకున్నది. కన్నులు తెఱచియున్న నారూపమే, మూసిన నారూపమే కన్పించు చుండ భ్రాంతియెట్లగును? (కొంచెమూరకయుండి మరల తలయెత్తి) ఛీ! ఛీ! భ్రాంతిగాక నిక్కమెట్లగు? నిక్కమయినచో నాయెదురఁబడినంతనే నాక

కాని, యింక నీనిబింక మెట్టిదియో గనుంగొనెద.

(నిష్క్రమించును.)

(ప్రహ్లాదుడు, భటులు ప్రవేశింతురు.)

భ—ప్రహ్లాదా! నడువుము, నడువుము. ఇదె చక్రవర్తి యానతిని వింటివా?

ప్ర—ఏమని?

భ—నీవీ హరిభక్తి విడిచితివా సరే. లేకున్న నీయగ్ని గుండమునఁ గూలద్రోయుమని?

ప్ర—(నవ్వుచు) జనకునియానతి శిరసావహించితి.

భ—విష్ణుభక్తి విడిచెదవా?

ప్ర—విడువఁజాల.

భ—మఱి యగ్నికుండమునఁ గూలెదవా?

ప్ర—అవశ్యము సిద్ధుఁడనై యుంటి.

భ—నీకర్మము. మాకేల, రమ్ము.

ప్ర— గీ॥ అగమాంతవిలోల, సర్వాత్మ, శౌరి,
చిన్మయాకార, హరి, హరీ, శ్రీవిహారి,।
పరమపురుష, దయానిధీ, దురితదూర,
దివ్యరూప, నిరామయ, దేవదేవ॥

(భటులీడ్చుకొనిపోవుదురు.)

4 అంకము. 4 రంగము.

(అగ్నిజ్వాలలనడుమ నరమోహన్నికన్నులతో
చేతులనుమోడ్చి ప్రహ్లాదుఁడు ప్రవేశించును.)

ప్ర—ఓ జగదీశా! ఓ భక్తవత్సలా! ఓ కరుణాసముద్రా!

సీ॥ ఓ సత్కృపావీక్షణోదార, యఘదూర,
దీనజనోల్లాస, దేవదేవ।
ఓ త్రిజగద్వందితోన్నతగుణ, భూష
ణాంచితగాత్ర, నీలాబ్జనేత్ర।
ఓ రత్నకుండలహారకేయూరకి
రీటశోభిత, పుండరీకహస్త।
ఓ హాసరుచిరచంద్రోదయాననదివ్య
భాసమానవిలాస, పరమపురుష।

గీ॥ ఓ మునీంద్రమనఃపద్మధామ, శౌరి,
శ్రీమహిత, దివ్యసేవ్య, నమామిభక్త।
తామసాఘవిరామ, సుందరపదాబ్జ,
దీనకల్పభూజా, కోటిభాను తేజ॥

కం॥ కరుణానిధి, శరణావన
బిరుదాంకిత, నిరతశత్రుభీకర, మురళీ।
ధర, సురవరపరిపూజిత
చరణాంబుజయుగళ, భవ్యచరితాత్మ, హరీ॥

(మంటలు చల్లారిపోవును)

హి—(గదను గిరగిరంద్రిప్పుచు ప్రవేశించును.)

శా॥ ఓరోరీ! పలుగాకి, దుష్ట, హరిసేవోన్మత్తచిత్తా, యిటుల్
కారుల్ ప్రేలెదవో సభాస్థలిని లోకద్వేష్యుఁడౌ విష్ణు? వం
చారా! దిక్కులకెల్ల మేటినగు నాయౌద్ధత్యముం జూడవో?
ఘోరాత్మా, పరిపంథిఁ గొల్వ మది సిగ్గున్ మానమున్ వీడితే?॥

ఓరీ! నీవింక హరిని స్మరించుటమానవా?

ప్ర—(తండ్రికి నమస్కరించి) తండ్రీ! నిరంతరానంద దాయకంబగు హరిసేవామృతమరందపానపరవశంబగు నాచిత్తంబితరానక్తంబెట్లగును?

గీ॥ ఘోరసంసారసాగరోత్తారకంబు
హరిపదాంభోజయుగచింతనామృతంబు
గ్రోలి మత్తిలి యానందలోలుఁడైన
జీవుఁడిహచింతనలఁగోరఁ బోవునొక్క?॥

హి—ఏమేమి! అఖిలలోకంబు లస్మదాధీనంబులై మన్నిరీక్షణమాత్రంబున జవజవ వడంకుచుండ నీవించుకేనియు నదురుబెదురును లేక యెదురాడుచుంటివిగా?

ప్ర—నాయనా! లోకంబులెల్ల గెల్చిన మేటివీరుండవు, లోపలిశత్రులనేల గెల్వఁబూనకుంటివి? దిక్కుల నెల్లగెల్చిన ధీరుండవిసీ! దేహాభిమానంబునకుం జిక్కెదవా?

సీ॥ ధరణి నేకాతపత్రముగ నేలినమేటి,
చిత్తవాసనలకై చిక్కఁడో కొ।
త్రిదివంబు నాకగోటఁ ద్రిప్పనేర్చినమేటి,
కామచింతనలచే కట్టుపడెనొ।
పాతాళమును గెల్చి పరిభవించినమేటి,
భవపాశముల పట్టుపడెదవో కొ।
దిక్పతులనడంచి ధిక్కరించినమేటి,
మోహాంబునిధిఁగూలి మునుకలిడెనొ।

గీ॥ సర్వశాస్త్రాభిరతుఁడవో సరసమతివి,
ప్రకృతిదుఃఖములకు పాలుపడెదవో కొ।
భువనముల నెల్ల గెల్చిన పురుషసింహ,
నీమనము నిశ్చలము చేయ నేరవో కొ? ॥

హి—నీవితండవాదములింకను గట్టిపెట్టవా? దుర్మతీ! నీశిరంబిప్పుడే యీగదాదండంబునఁ బిండిగావించెద, నిఁక నిది కెవ్వరో, నీహరి యేడనున్నాఁడో కాచుకొమ్ము.

ప్ర—తండ్రీ! ఇదుగో యీనవకోమలాకారుండు నీకన్నులకగపడుట లేదా? (ముందుచూపుచు)

గీ॥ కరములను శంఖచక్రఖడ్గగదలమర
నురమునను కౌస్తుభశ్రీలు మెఱయుచుండ।
నలుదెసలు దానెయై మందు వెలుఁగువాఁడు
దీనరక్షకుఁడితఁడె నా దిక్కుచూడు॥

హి—(అదరిపడిచూచును.)

ప్ర—తండ్రీ, నూదిమొనయంతయేని శ్రీహరి లేని చోటు గలదా?

హి—(తనలో) ఇంక వీనినేమిసేయుదు? పెట్టరానిపాట్లన్నియుం బెట్టించితిని గాని వీనియసువులూడకుండుట కేమి హేతువో?

వీఁడు సామాన్యబాలకుండని తలపోయుచుంటిని గాని కాఁడు కాఁడు. జన్మాంతరశత్రువగు నాహరిపంపున నన్నులమటలపాలొనరింప నేతెంచి పరమవైరిగాఁ దోఁచుచున్నవాఁడు. వీనివలన నాకెట్టికీడును మూడదుగద? ఏమో! ఎట్టి యవస్థాంతరము రానున్నదో? కానిమ్ము. ప్రాణమున్నంతవఱకు కాళవిడువరాదుగదా? చేతనైనంతవఱకు సాధించి చూచెద. (ప్రకాశముగా) ప్రహ్లాదా! ఏమనుచుంటివి, నీహరి నాసభాభవనంబుగూడఁ జొరసాహసించెననియా? ఏఁడీ? ఏరూపమున నెందుండెనో చూపు, యిప్పుడే వానిఖండించివైచెద.

ప్ర—తండ్రీ! ఇదుగో.

సీ|| నీలమేఘచ్ఛాయ నేలు దేహమువాఁడు
శంఖచక్రాదిహస్తములవాఁడు.
మండితనవరత్నకుండలమ్ములవాఁడు
రమణీయమణిభూషణములవాఁడు।

కుటిలాలకాంచితనిటలభాగమువాఁడు
తళుకు లేనవ్వుతోఁ గులుకువాఁడు।
వనమాలికాశ్రీవిభాసివక్షమువాఁడు
ఘనతరగరుడవాహనమువాఁడు।
గీ॥ శత్రుభీకరశౌర్యవిస్తారవిమల
విశ్వరూపకుఁడై నన్ను విడువకిపుడు।
తోడునీడగ నిదె నడయాడువాఁడు
చూడుమీ కట్టెదుట నున్నవాఁడుతండ్రి॥

హి—నిశ్చయముగ నీకన్నులయెదుట నున్నవాఁడా?

ప్ర—ఆహా! నిశ్చయముగ నున్నవాఁడు. అంతట నిం డియున్నవాఁడు.

హి—అంతట నిండియున్నవాఁడా? అట్లయిన నీస్తంభంబునఁ జూపఁగలవా?

ప్ర—అఖిలవ్యాపకుం, డందేల లేక యుండును?

హి—నిశ్చయముగ నీవు గనుచుంటివిగా?

ప్ర—కనుచుఁటిని గాని నీవుమాత్రమింతలో నానిఖ లాత్ముని గననెంచకుము.

హి—ఆహా! ఇదియా నీకుటిలవేషము? ఇఁకఁ దెలిసినది. నీహరి సర్వవ్యాపకుఁడుగదా? మేముమాత్రమాత ని గాంచనెంచరాదేమి?

(తెరలో) ఎంతమాత్రమగ్గెంచరాదు.

హి—(తిరిగి చూచును.)

(చండామార్కునితో శుక్రాచార్యులు ప్రవేశించును)

శు—అల్లెంతమాత్రము నెంచరాదు. రాక్షసేశ్వరుం డెట్టి వరంబులందియున్నను తానాహరిమాయను న రియింపగలననిమాత్ర మెంచరాదు. (హిరణ్యకశి పుః గని) దానవేంద్రా, యేమిది, పసివానిపై కసిదీర్చుకొనఁగోరుచుంటివి?

హి—గురుసార్వభౌమా! నిరంతరద్రోహియగు వీనిపై కసిదీర్చుకొనఁదగదా? చూచితివే యీదురితాత్ము నిద్రోహము? తనహరియఁట, అఖిలవ్యాపకుడఁట, తానఁట, యంతటను వాసింగనుచున్నవాఁడఁట, యేనుమాత్రమాపరమపూజ్యుని గననెంచరాదఁట, యిదేటినుద్ది?

శు—రాజా! అది నిజమే. స్వయంజ్యోతియగు నాన ర్వశక్తిని సామాన్యులు గననెంచఁదగదు.

హి—హా! యేమనుచుంటిరి? ఈబాలుండధికుండా, మేము సామాన్యులమా? ఇదేటిమాట? మేమేలగ నరాదు? వీఁడెట్లుగనఁదగు?

శు—దానవేంద్రా! మన చిరంజీవి సత్వగుణపరిపూర్ణుం డు గాన నాత్మస్వరూపానుభవంబు నందుచున్నవాఁ

డు. నీవో తామసాలంకారుండవు గాన నామ హాత్రకతేజోనిధానంబరయఁజాలవు. అసమర్థులకో కప్పుడాదివ్యసందర్శనాభిలాష సిద్ధినందదే, అది చాల ననర్థహేతువగుఁ గాన నీవాకాంక్షను వదలుకొనుము.

హి——(వినిపించుకొనకయే) ప్రహ్లాదా! నీదేవునిందుఁ జూపెదవుగదా?

ప్ర——తండ్రీ, యందులకు సందేహమా?

శు——రాజా, వలదు వలదు. కులమునకు సంతసమునిలువుము. ముక్కోపివై మొదలఁజెడకుము. పరమాత్మనిపై పగదలఁపకుము, నామాటవినుము.

హి——(నిరుత్తరుఁడై) బాలకా! నీహరి యీకంబమున లేకున్న నిన్నీగదతోడనే కడతేర్తునుసుమా?

ప్ర——జనకా! ఏల సంశయించెదు?

ఉ|| అంతటనున్నవాఁడు పరమాత్ముఁడు సర్వమయుండు మాధవుం|
డంతటనున్నవాఁడు పరమాణువునందియుఁ దాను బ్రహ్మకు|
క్ష్యంతము నిండియుండు విభుఁడక్కడనిక్కడనాఁగనేల? యు|
ట్లంతట నిండి స్తంభమున నౌర సభాంతరమందులేఁడొకో?||

హి——(గద త్రిప్పుచు స్తంభమును సమీపించును)

ప్ర——(ఆశ్చర్యముతో) ఆహా! ఇదేటివింత? ఇంతలో నా శ్రీకాంతుండు తన కాంతప్రసన్నవదనబింబం

బెంత భీకరాకారంబొనరించినాఁడు, అబ్బా! ఇదే టిరూపము? నేనిదివఱకెన్నఁడు నిట్టిరూపుఁ గనియెఱుంగనే, హరివలన వినియైన నెఱుంగనే?

మ॥ అరరే!చూడవిచిత్రమాయె,తొలియాపామాయమర్త్యోన్,భయం
కరసింహాకృతి, కాదు కాదు; నగమాకారంబె సింగంబుగా
నరరూపంబు నగంబుగాఁదనరె, నేనామంబునం జెల్లునో?
నరసింహాకృతిఁబూనెనొక్కొ హరి నానాదిక్కులందా నెరైా?॥

హి—(స్తంభమును గదతో వ్రేయును. నరసింహమూర్తి ప్రత్యక్షమగును)

(తెరపడును.)

(మరల తెరయెత్తినతోడనే హిరణ్యకశిపుఁడు ప్రహ్లాదుఁడు ప్రవేశింతురు.)

హి—(ప్రహ్లాదు నక్కునంజేర్చి చెక్కిలినొక్కుచు)

శా॥ అన్నా చిన్నికుమార నీకతననేఁడా జన్మశత్రున్ వడిం
గన్నాఁడన్, మది మోదమందితిని, నాకష్టంబిఁకన్ దీఱె, లో
మున్నేఁ జేసిన శిక్షలెంచకుమి, ప్రహ్లాదంబు చేకూడు సం
పన్నత్వంబొనగూడు నీకు నిటుపై, భద్రంబుగానుండుమో
యన్నా, పోయెద శౌరితోడి పగదీర్పన్ ధన్యతం జెందఁగన్॥

(తెరజాఱును.)

4 అంకము. 5 రంగము.

(హిరణ్యకశిపుని జీల్చి తొడలపై నిల్చుకొన్న నృసింహమూర్తి, స్తంభములో ప్రక్కను నిలిచియున్న ప్రహ్లాదుఁడు, మునులు, దేవతానీకము ప్రవేశింతురు.)

ము— సీ॥ తపసిభూములనెల్ల దగ్ధంబొనర్చిన
చెడురక్కసుని నేఁటికడఁచినావు।
దే— సురభామినులఁబట్టి చెఱపట్టి పలుపాట్ల
నొంచిన దైత్యు శిక్షించినావు।
ము.— నరలోకమెల్ల నానాబాధలనొంచు
తెంపరి దనుజునిఁజంపినావు।
దే— మునిసత్త్రములఁబట్టి మలుకోలలు వొడల్చఁ
గ్రుచ్చిన దానవు వ్రచ్చినావు।
గీ॥ దైత్యకులకంటకాళిలతాలవిత్ర,
భక్తజనవనజైత్ర, దివ్యతరగాత్ర।
భళిభళీ! నిజకోపాగ్నిభస్మితాంహ,
దానవాదిదుర్జనరంహ, శ్రీనృసింహ!

నృ—(పాలోచనుఁడై ప్రహ్లాదునిగాంచును.)

దేవేంద్రుఁడు—(ప్రహ్లాదుని ముందుకుఁదీసి) కుమారా, సర్వలోకకంటకుఁడగు భవజ్జనకు సంతమొందింప

లోకరక్షకుండిట్టి దుర్భరోదగ్రభీకరనారసింహాకృతిం బూనియున్నవాఁడు? తండ్రీ! ఇట్టితీండ్రింబడిపఱకేమొన్నఁడును గన్నయది కాదు. సాగ్రహుండై దుర్వార క్రోధానలశిఖల దెసల విరఁజిమ్ము నీనరకేసరమూర్తి నిం బ్రసన్నునింగావించి దయచేయుము. పరమభాగవతశేఖరుండవగు నీవుదక్క నొరులకుం గన్నెత్తిచూడ దుస్సహంబగు నీమూర్తిం బ్రసన్నుం గావించి భక్తజనసులభుని గావించి దయచేయుము.

ప్ర—(వినమితశిరస్కుండై) మహనీయులారా! నిరంతరహరిసేవాపరాయణులు సంతతసత్వగుణాభిరాములు నగు మీరీచిఱుతవానిం బెద్దసేయుట మీకరుణావిశేషంబుగాక వేఱొండుగాదు కాకున్న నల్పుండ, నసురార్భకుండనగు నన్నిట్టితఱిని నియమింప నేమున్నొనర్చిన తపఃఫలంబుగాదే? ఇదె భవదాజ్ఞానువర్తినై నాయోపినతెఱంగున మొఱవెట్టి యీకరుణానిధి యుల్లంబు గరఁగింపఁజూచెద. (నృసింహమూర్తి యెదుర ముకుళితహస్తుఁడై)

## దండకము.

శ్రీ నారసింహాకృతింబూనియున్నట్టి యోదేవ, దివ్యప్రభావా, మమ్ముంగావ నీవేళ నీదివ్యరూపంబునుంబూనుచున్ విశ్వరూపుండవై కంబముంజీల్చి దుర్వారతేజుండవై మహాహంబా భవత్ శౌర్యమేపార వీరాధివీరుండవై, లోకజాలంబులన్నొంచి కష్టంబులన్ ముంచి నానావిధన్ బాధలొందించి దుఃఖంబులన్నించు నీరాక్షసాధ్యక్షు నాజన్మవిద్వేషినింగూల్చి లోకాళికిన్ మోదముంగూర్చి రక్షించితో భక్తలోకైకచింతామణీ, దేవతానీకచూడామణీ, యింక నీభీకరాకారముంబాపవే, మాయెడన్ సత్కృపంజూపవే, నీనృసింహాకృతింగాంచి దేవాదులున్ మానిలోకంబుభీతిల్లుచుండంగ నేనెంతి? వర్ణింపగానేర్తునే? గూర్తులన్ బ్రోవఁగా కల్పభూజంబవీవంచు లోనెంచి సేవించు మాపాపముల్ ద్రుంపవే, పెంపవే నీపయిన్ భక్తి, నాపక్తితో ముక్తికిందోవఁజూపింపవే, నేఁదామసోద్రేకుఁడన్ దైత్యజాతుండ నత్యల్పుఁడన్ చంచలుండంగదా భక్తసంతోషకారీ, నమోపాపహారీ, నమో వేదవిద్యానుసారీ, నమోదాసహృత్పుణ్యమందిరావాస, యీశా, నమోచిద్విలాసా నమస్తే నమస్తే నమస్తే నమః॥

(నృసింహమూర్తి శాంతిపొందును.)

[ తెరపడును. ]

